# బసవపురాణసారం







బసవపురాణసారం

## యోగ రుషి



పాలమూరు జిల్లాలో తాళపత్రగ్రంథాలు పేరు వింటేనే వెంటనే మనకు నాగలింగ శివయోగి గుర్తుకు వస్తారు. తాళపత్ర గ్రంథాలకు పర్యాయపదంగా ఆయన పేరు తెచ్చుకున్నారు. కొన్ని వేల తాళపత్ర గ్రంథాలను సేకరించి భావితరాలకు అందించిన సాహిత్య రుషితుల్యుడాయన. తెలుగులో మొట్టమొదటి శతకం శివతత్త్వసారం వంటి అనేక అముద్రిత గ్రంథాలను వెలుగులోకి తెచ్చి పాలమూరు సారస్వత సాహితీ క్షేత్రంలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు. నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణి సంస్కృత వ్యాఖ్య, గౌరీ విలాసం, బసవపురాణసారం, వీరశైవ రహస్య సిద్ధాంత శిఖామణి, యాగంటి వచనాలు వంటి అమూల్యమైన, అరుదైన తాళపత్ర గ్రంథాలను సేకరించి సారస్వత లోకానికి మహోపకారం చేశారు. ఆంధ్ర నానార్థ నిఘంటువు, శుద్ధ యోగోపనిషత్, బసవపురాణసారం, గీతాయోగసారం వంటి అమూల్యమైన అనంగ రత్నాలను వెలువరించారు. ప్రస్తుతం యోగ సాహిత్యంలో విశేష సాధన చేస్తూ తన శేష జీవితాన్ని దానికే అంకితం చేశారు. ప్రక్షిప్త ప్రక్షేపకాలైన యోగ సాహిత్యాన్ని తన సునిశిత పరిశోధనతో శుద్ధమైన యోగాన్ని కనుగొని "శుద్ధయోగోపనిషత్" అనే ఉద్గ్రంథాన్ని వెలువరించారు. నిత్య పరిశోధక విద్యార్థిగా ఏదో తెలుసుకోవాలనే జిజ్ఞాసతో ఇంకా యోగ సాహిత్యంలో పట్టువిడవని విక్రమార్కునిలా పోరాడుతున్నారు. 77 ఏళ్ళ వసంతంలో కూడా యోగవిద్యను ప్రబలంగా అందరికీ అందించాలని తపనపడుతున్నారు. అనారోగ్యం వెంటపడినా తన జిజ్ఞాసను ఏమాత్రం సడలించక నిరంతర యోగ స్వాప్నికుడై యోగచింతనలో గడుపుతున్నారు. యోగ అంటే ఆసనాలు కావని, యోగ అంటే జీవాత్మతో పరమాత్మను తలవడమే యోగమని అంటారు.

నిరంతరం యోగ సాధనలో నిమగ్నమవుతూ తన శిష్యులకు యోగవిద్యను ప్రసాదిస్తున్నారు. తన యోగక్షేత్రంలో "విశ్వశుద్ధ యోగ పరివార్" అనే యోగాలయాన్ని స్థాపించి యోగ మిత్రులకు ప్రతి యోగవిద్యను నేర్పిస్తూ తన్మయుక్తులవుతున్నారు. వయసుపైబడినా మనసుతో సాధన చేస్తూ యోగను ప్రచారం చేస్తున్నారు. అసలైన యోగ సాహిత్యాన్ని విస్తృతంగా పరిచయం చేయాలనేది తన ఆశయమంటారు.

- భీంపల్లి శ్రీకాంత్



శ్రీగురు బసవలింగాయ నమః

# బసవపురాణసారము

## 7

రచన

**గొబ్బూరి వీర సంగయ్య**

సంపాదకులు

**రుష్యశ్రీ నాగలింగ శివయోగి**

పరిష్కర్త

**కపిలవాయి లింగమూర్తి**



**పాలమూరు సాహితి**
**మహబూబ్‌నగర్**

# బసవపురాణసారము

సంపాదకులు: రుష్యశ్రీ నాగలింగ శివయోగి

ప్రథమ ముద్రణ - జనవరి 2007

ప్రతులు - 1000

హక్కులు - ప్రచురణకర్తవి

మూల్యము : రూ. 50/-

ప్రచురణసంఖ్య : 7

ప్రతులకు :

1. విశ్వ శుద్ధయోగ పరివార్ యోగాలయం
   కొత్త బస్టాండ్ దగ్గర జడ్చెర్ల,
   మహబూబ్‌నగర్ - 509 302, ఫోన్: 08542 - 232602

2. శ్రీమతి హేరూర్ శోభా విజయ్‌కుమార్, అడ్వకేట్
   3-4-468,
   రెడ్డి ఉమెన్స్ కళాశాల ఎదురుగా (రత్నా కాలేజీ ప్రక్కన)
   బర్కత్‌పురా, హైద్రాబాద్ - 500 027,
   సెల్: 9985769695

3. భీంపల్లి శ్రీకాంత్
   అధ్యక్షులు
   పాలమూరు సాహితి
   ఇ. నెం 8-5-10/12, టీచర్స్ కాలనీ
   పాలమూరు - 509 001
   సెల్: 9885046622

డి.టి.పి:

శ్రీ సాయిరాం గ్రాఫిక్స్,

రాంనగర్, హైద్రాబాద్, ఫోన్ : 2761 1973

ప్రింటింగ్ : వంశీ ప్రింటర్స్,

డి.సి.సి బ్యాంక్ కాంప్లెక్స్ యం.నగర్

సెల్: 94400 68437



ಕತ್ರು ಜಗದ್ಗುರು ಶೀ ಕರಿಬಸವರಾಜೇಂದ್ರ ಮಹ್‌ಸ್ವಾಮುಲು
ಶ್ರಿ ಗವಿಮಠ ಮಹ್ ಸಂಸ್ಥಾನಮು,.
ಉರವ ಕೊಂಡ, ಅನಂತಪುರಂ ಜಿಲ್ಲಾ,





Katru Jagadguru
Sri Kari Basava Rajendra Maha Swamulu
Sri Gavimatha Maha Samstanm
Uravakonda, Ananthapur Dist.


## ಮುನ್ನುಡಿ

## ಬಸವಪುರಾಣಸಾರ

ಬಸವಪುರಾಣಗಳು ಕನ್ನಡ-ಸಂಸ್ಕ್ರತ ತೆಲುಗು ಭಾಷೆಗಳಲ್ಲಿ ರಚನೆಯಾಗಿವೆ. ಆದರೆ ಅವೆಲ್ಲಿ ಬೃಹದಾಕರ ಗ್ರಂಥಗಳು, ಬೃಹತ್ ಗ್ರಂಥಗಳನ್ನು ಓದಲು ಎಲ್ಲರಿಗು ದೊರೆಯೆ ಬಹುದು. ಅಂಥಹ ಕೃತಿಗಳ ಪ್ರಭಾವ ದಿಂದ ಒಂದೊಂದು ಪದ್ಯದಲ್ಲಿ ಒಬ್ಬ ಶರಣರ ಚರಿತೆಗೆಳನ್ನು ರಚೆಸಿದ್ದೆನೆಂದು ಅತನೇ ತಿಳಿಸಿದ್ದಾನೆ.

ಶಂಕರಾಚಾಯ್ರ್ಯುಂಡು ಸಂಸ್ಕ್ರತಂ ಬೋನರಿಂಚೆ
ಕರ್ಣಾಟು ವೃತ್ತ ಸಂಗತಿ ಯೋಳೇಂದ್ರ
ಗ್ರಾಮ ಷಡೆಕ್ಷರ ಸ್ವಾಮಿಯು ರಚಯಿಂಚೆ
ಭಾಮಿನೀ ಪಟ್ಟದಿನ್ ಭೀಮಸುಕವಿ
ಪ್ರಸ್ತರಿಂಚೆನು ಪದ್ಯಮುಲನು ನಟ್ಟೆ
ಬಸವಪುರಾಣಂಬು ಪ್ರಮಥುಲ ಕೂಕ್ಕೂಕ್ಕ
ಪದ್ಯಂಬುಗಾ ತತ್ಪ್ರ ಭಾವ ಸಹಿತ '' ಎಂದು

ಈ ಬಸಪವುರಣಸಾರ ವನ್ನು ಅತ್ಯಂತ ಭಕ್ತಿಯಿಂದ ರಚನೆಮಾಡಿರುಪುದಾಗಿ ತಿಳಿಸಿದ್ದಾನೆ. 'ಬಸವಪುರಾಣ ಸಾರಮು ಪ್ರಬಂಧಮುಗಾ ರಚಯಿಂಚು ಭಕ್ತಿತೋ' ಬಸವಣ್ಣನಲ್ಲರುವ ಅತನ ಭಕ್ತಿ ಈ ಪಧ್ಯಗಳಲ್ಲಿ 'ಪದಮುಲಕು ಜೇತು ಪದಿವೇಲು ವಂದನಮುಲು' ತಿಳಿಯುತ್ತದೆ. ಈ ಕೃತಿಯ ಕರ್ತ್ರುವು ಆಶ್ವಾಸಾಂತದಲ್ಲಿ 'ಇತಿ ಮದ್ಗುರು ಲಿಂಗಜಂಗಮ ಪ್ರಸಾದಲಬ್ದ ಗಣಪರ್ವೂಲ್ಲಾಸ ಭವನಾಶ ಪುರೀಶನಿವಾಸ ಭಕ್ತ ಮಹೇಶ್ವರ ಪಪ ಪಂಕರುಹ ಭವನಾಶಪುರೀಶ ನಿವಾಸ ಚಕ್ರ ಮಹೇಶ್ವರ ಪಾದವಂಕೇರುಹ ಭೃಂಗ ವೀರ ಸಂಗನಾಮಧೇಯ' ಎಂಬ ವಾಕ್ಯದಿಂದ ಭವನಾಶಪುರಿಯ ವೀರಸಂಗ ನೆಂಬುವರು ಈ ಕೃತಿಯನ್ನು ರಚಿಸಿದ್ದಾನೆಂದು ತಿಳಿಯುತ್ತದೆ. ಬಸವಪುರಾಣದಲ್ಲಿ ಬರುವ ಶರಣರ ಕಥೆಗಳು ತಿಳಿದಿದ್ದರೆ ಈ ಕೃತಿ ಸುಲಭವಾಗಿ ಅರ್ಥವಾಗುತ್ತದೆ. ಈ ಕೃತಿಯ ಹಸ್ತಪ್ರತಿ ಒಂದೇದೊರೆಕಿರುವುದರಿಂದ ಅಲ್ಲಲ್ಲಿ ಅಲ್ಪಸ್ವಲ್ಪ ಅಕ್ಷರಗಳು ಅರ್ಥವಾಗುವುದಿಲ್ಲ. ಇಂಥಹ ಕೃತಿಗಳಿಗೆ ಮುನ್ನುಡಿ ಬರೆಯುವುದೆಂ

ದರೆ ಸೂರ್ಯನನ್ನು ನೋಡಲು ಬೆಳಕನ್ನು ತೆಗೆದುಕೊಂಡಂತೆ ಅಗುತ್ತದೆ. ಆದೃಷ್ಟಿಯಿಂದ ಈ ಕೃತಿಯನ್ನು ಕುರಿತು ಒಂದೆರಡು ಒಳ್ಳೆಯ ಮಾತನ್ನಡಿದರೂ ತಪ್ಪಾಗುತ್ತದೆ.

ನೂರಾರು ವರ್ಷಗಳ ಹಿಂದೆ ಬಸವಾದಿ ಶಿವಶರಣರ ಚರಿತ್ರಯನ್ನು ಅತ್ಯಂತ ಸುಲಲಿತ ಪದ್ಯಗಳಲ್ಲಿ ಒಂದು ಪದ್ಯದಲ್ಲಿ ಒಂದು ಕಥೆಯನ್ನು ರೂಪನಿರುವುದನ್ನು. ನೋಡಿದಾಗ ಈ ಕೃತಿಯ ಮಹತ್ವ ಅತನ ಅಗಾಧ ಪಾಂಡಿತ್ಯ ಮುಂತಾದವುಗಳ ಮಹತ್ವ ಅರಿವಾಗುತ್ತುದೆ.

'ಬಸವಪುರಾಣಸಾರ' ಕೃತಿಯ ಸಂಪಾದಕ ರಾದ ಶ್ರೀ ಶರಣರಾದ ನಾಗಲಿಂಗ ಶಿವಯೋಗಿಗಳು ಒಳ್ಳೆ ಸಂಸ್ಕಾರವಂತ ಕುಟುಂಬದಲ್ಲಿ ಬೆಳೆದು ಬಂದವರು. ದೂರವಾಣಿಯಲ್ಲಿ ಸ್ವಾಮೀಜಿ ಈ ಕೃತಿಗೆ ತಾವು ಮುನ್ನುಡಿಯನ್ನು ಬರೆಯಬೇಕೆಂದು ಕೇಳಿಕೋಡರು. ಒಂದೇ ಪದ್ಯದಲ್ಲಿ ಬಸವಾದಿಶರಣರ ಚರಿತೆಯನ್ನು ಬರೆದಿರುವುದು ಕೇಳಿ ಕುತೂಹಲಾದೆ. ಬಸವಣ್ಣನವರ ಭಕ್ತಿಯ ವ್ಯಾಪಕತೆಯ ಅರ್ಥವೂ ಮನದಲ್ಲಿಪೋಳೆಯಿತು. ಆ ಕೃತಿಯನ್ನು ಆದ್ಯಂತವಾಗಿ ಅವಲೋಕಿಸಿ ಬರೆಯಲು ಪ್ರಯತ್ನಿಸುವೆ, ಎಂದು ತೀಸಿದೆ. ನಾಗಲಿಂಗ ಶಿವಯೋಗಿಗಳು ಶುದ್ಧಯೋಗಿಗಳೂ ಹೌದು. ಝುರಾಕ್ಸ ಪ್ರತಿಯ ಜೋತೆಗೆ ಉರವಕೊಂಡ ಮಠಕ್ಕೆ ಬಂದೇಬಿಟ್ಟರು. ಅವರ ಆ ಇಳಿವಯಸಿನ ಉತ್ಸಾಹ, ಗ್ರಂಥ ಸಂಗ್ರಹ ಆಸಕ್ತಿ. ಹಸ್ತಪ್ರತಿಗಳ ಸಂಗ್ರಹ, ಅವುಗಳ ರಕ್ಷಣೆ, ಅವರ ಅಪಾರ ಅನುಭವಗಳು ಸಹತ್ಯಾಸಕ್ತರನ್ನು ಅಶ್ಯರ್ಯಗೊಳಸುತ್ತವೆ. ಅಪರೇ ಹೇಳಿದ ಮಾತು ಒಂದು ಸಾರಿ. ವರಂಗಲ್ ಪ್ರಾಂತದಲ್ಲಿ ಅತ್ಯಂತ ಪ್ರಾಚೀನೆವಾದ ಒಂದು ಗ್ರಂಥನ್ನು ಒಬ್ಬರ ಮನೆಯಲ್ಲಿದೆ ಯೆಂದು ಕೇಳಿದರು. ಅವರು ಕೊಡುವುದಿಲ್ಲ ವೆಂದಾಗ ನಿಮ್ಮ ಮನೆಯಲ್ಲಿಸುಮ್ಮನೆ ಹುಳ ಕಡಿದು. ಹಾಳಗುತ್ತದೆ. ಅದನ್ನು ಕೊಟ್ಟು ಬಿಡಿ ನಾನು ಬಹು ಚೆನ್ನಾಗಿ ಆ ಕೃತಿಯನ್ನು ಸಂರಕ್ಷಿಸುತ್ತಿನೆ ಎಂದರು. ಅ ಮನಿಯವರು ಒಪ್ಪಲ್ಲಿಲ್ಲವಂತೆ. ಆಗ ನಾಗಲಿಂಗಶವಯೋಗಿಗಳು ಆ ಕೃತಿಯನ್ನು ತೆಗೆದು ಕೊಂಡೇ ಹೊಗಬೇಕೆಂದು ನಿಶ್ಚಯಿಸಿ ಅ ರಾತ್ರಿ ಅವರ ಬಾಗಿಲಲ್ಲೆ ಮಲಗುತ್ತರೆ. ಬೆಳಗ್ಗೆ ಎದ್ದು ಇವರನ್ನು ನೋಡಿದ ಅ ಯಜಮಾನನೇ ಕೃತಿಯನ್ನು ಕೂಟ್ಟು ಕೈಮುಗಿದ ನಂತೆ. ಈ ರೀತಿ ಯಾಗಿ ಸುಮಾರು ನಾಲ್ಕುನೂರು ಹಸ್ತ ಪ್ರತಿಗಳನ್ನು ಸಂಗ್ರಹಸಿ ಪರಿಶೋಧಿಸಿ ಮ್ಯಾನುಸ್ಕ್ರಿಪ್ಟ್ ಲೈಬ್ರರೀ ಆಪ್ ಹೈದರಾಬಾದ್ ನಲ್ಲಿ ಇವರ ಹೆಸರಿನಲ್ಲಿ ದಾನವಾಗಿ ನೀಡಿದ್ದಾರೆ.

ಈ ತಾಳೆಹೋಲೆಗಳಿ ಗೋಸ್ಕರ ಮನೆಲಲ್ಲಿತುವ ಒಡವೆಗಳನ್ನು ಮಾಂಡ್ಡೂ ಉಂಟು.

ಇನ್ನು ಯೋಗ ಶಾಸ್ತ್ರದಲ್ಲಿ ಪರಿಣತರು ಹಾಗೂ ಯೋಗ ಗ್ರಂಥಗಳನ್ನು ಸಂಗ್ರಹಿಸಿದ್ದಾರೆ. ಎಲ್ಲಿಯೂ ದೋರೆಯದ ಯೋಗ ಗ್ರಂಥಗಳು ಇವರಲ್ಲಿ ದೊರೆಯುತ್ತವೆ 'ಯೋಗವಿಧಾನಮು' ಎಂಬುದಾಗಿ ಶಾಸ್ತ್ರಯವಾಗಿ ಪರಿಶೊಧಿಸಿ ಬರೆದಿದ್ದಾರೆ. ಇದನ್ನು ಅವರ ಮುಖತ ತಳೆದುಕೊಳ್ಳಬೇಕಾದುಎನ್ನುತ್ತಾರೆ. ನಿಜಯೋಗಾಶ್ರಮವನ್ನು ನಿರ್ಮಿಸಿ, ಆ ಯೋಗಪ್ರಸಾರಕೆ ತಮ್ಮ ಜೀವನವನ್ನು ಸಮರ್ಪಿಸಿದ್ದಾರೆ. ಇಪ್ಪತ್ತುವರ್ಷದ ನೋಟ್ಸು ಗಳನ್ನು ಮಾಡಿಟ್ಟಿದ್ದಾರೆ. (ಈ ಯೋಗ ಗ್ರಂಥಗಳನ್ನು ಉರವಕೊಂಡ ಗ್ರಂಥಾಲಯಕ್ಕೆ ದಾನವಾಗಿ ಕೂಡುತ್ತಿನಂದು ವಾಗ್ದಾನ ಮಾಡಿದ್ದಾರೆ.) ಇವರಿಂದ ರಚನೆಯಾದ ಕೆಲವು ಕೃತಿಗಳಲ್ಲಿ ಅತ್ಯಮೂಲ್ಯವಾದ ಕೃತಿಗಳು.

1) ಆಂದ್ರ ನಾನಾರ್ಥನಿಘಂಟು
2) ಶುದ್ದಯೋಗೋಪನಿಶತ್ತು
3) ಋಷ್ಯ ಶಿವಯೋಗಿ
4) ನಾ ಜೀವಿತಚರಿತ್ರ
5) ಬಸವಪುರಾಣಸಾರಮು

ಈ ಕೃತಿಯನ್ನು ಹೊರತರುವಾಗ ಒಂದು ಸೊಚನೆಯನ್ನು ಕೊಟ್ಟೆ , ಈ ಬಸವ ಪುರಾಣದ ಪ್ರತಿ ಪದ್ಯಕ್ಕೊ ಸಂಕ್ಷಿಪ್ತ ತಾತ್ಪರ್ಯ ಬರಿದರೆ ಚೆನ್ನಾಗಿರುತ್ತೆ ಎಂದು ತಿಳಿಸಿದೆ. ಅದಕ್ಕೆ ಶಿವನ ಅನುಗ್ರಹದಿಂದ ಆರೋಗ್ಯ ಚೆನ್ನಗಿಯಾದರೆ ಮುಂದಿನ ಮುದ್ರಣದಲ್ಲಿ ನೇರಿಸುವೆನೆಂದಿದ್ದಾರೆ. ಅವರಿಂದ ಆಕಾರ್ಯವನ್ನು ಅಯುರಾಗೋಗ್ಯೆವನ್ನು ಕರುಣೆಸಿ ಬಸವಾದಿ ಶಿವಶೆರಣರು ಅನುಗ್ರಹಿಸಲೆಂದು ಪ್ರಾರ್ಥಿಸುತ್ತಿನೆ.

ಇವರಲ್ಲಿ ಅನೇಕ P.H.D. ಅಧ್ಯಯನಮಾಡುವ ವಿದ್ಯಾರ್ಧಿಗಳು ಬರುತ್ತಾರೆ. ಇವರ ಮಾರ್ಗದರ್ಶನ ಪಡೆಯುತ್ತಾರೆ. ಇವರು ಅನೇಕ ಲೇಖನಗಳನ್ನು ಬರೆದಿದ್ದಾರೆ.

'ಶಿವ ಪ್ರಸಂಗರತ್ನಾಕರ' 'ಶವಯೋಗಸಾರಮು' ಮುಂತಾದ ಅಮೂಲ್ಯ ಕೃತಿಗಳಿವೆ

ಸರಳರೂ, ಸಜ್ಜನರೂ, ಸುಹೃದಯರೂ, ವಿಮರ್ಶಾತ್ಮಕ ದುಷ್ಟಿಕೋಣರೂ ಅದ ಶ್ರೀ ನಾಗಲಿಂಗ ಶಿವಯೋಗಗಳು ನಮ್ಮೆಲ್ಲರೂಂದಿಗೆ ಇರುವುದೇ ಒಂದು ಭಾಗ್ಯ.

ಇವರ ಮಕ್ಕಳು, ಮೊಮ್ಮಕ್ಕಳು ಅಳಿಯಂದಿರು ಇವರ ಕುಂಟುಂಬವೆಲ್ಲ ಸುಖ ಸಂತೊಶ ದಿಂದ ಇರಲಿಕ್ಕೆ ಕಾರಣವಾನ್ನು ಅವರೇ ಈ ರೀತಿಯಾಗಿ ವಿವರಿಸುತ್ತಾರೆ. 'ಸ್ವಾಮೀಜಿ ನನ್ನ ಜೀವನವೆಂಬ ವೃಕ್ಷವನ್ನು ಸರಸ್ವತಿಯ (ಸಾಹಿತ್ಯಹಾಗೇ ಯೋಗ) ಪಾದದಲ್ಲಿ ಸಮರ್ಪಿಸಿ ಆ ವಿದ್ಯಾ ಬಾಂಡಾರವನ್ನು ಸಂರಕ್ಷಿಸಿದ್ದ ಲಿಂದ ಪ್ರತಿತ ನನ್ನ ಕುಟುಂಬವನ್ನು ಆ ಸರಸ್ವತಿಯೇ ಕಾಪಾಡುತ್ತಿದ್ದಾಳೆ' ಎಂಬ ಮಾತು ಸತ್ಯವಾವದ್ದು. ಎಂಥಹ ನಿಷ್ಠೆಯ ಅನುಭವದ ಮಾತು ಅಲ್ಲಿವೆ?



ప్రకాశకులు

---

డాక్టర్ రత్నపు గంగాధర్ గౌడ్

శ్రీమతి రత్నపు భారతీదేవి

మహబూబ్‌నగర్

# బసవపురాణసారం

బసవపురాణసారమను ఈ పద్యకావ్యము బసవసాహిత్యానికే మణిపూసలాంటిది. అవతారపురుషుడైన బసవేశ్వరు;డు 12వ శతాబ్దంలో కళ్యాణి పట్టణం రాజధానిగా(కర్ణాటకలో) బిజ్జలుని కొలువులో మహామంత్రిగా నుండి సర్వమానవాళికి పరమాత్మ తత్త్వాన్ని ప్రబోధించుచు, కుల, మత, వర్గ, వర్ణ, స్త్రీ, పురుష, వయో భేదం లేకుండా అందరికి ఇష్ట లింగారాధన ప్రబోధిస్తూ తన భక్తి ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఆనాడు ఈ ఉద్యమ ప్రభావానికి లోనుకాని ప్రాంతంకాని, ప్రజలుకాని లేరంటే అతిశయోక్తి కాదు. బసవేశ్వరుడు తన దివ్య వచనాల ద్వారా ప్రజల దృక్పధాన్ని భక్తిమార్గంలో నడిపించి, లింగధారులుగాజేసి పరమేశ్వరుని అనుగ్రహానికి పాత్రులుగా-జేసినాడు. ఈ మార్గంలోనే అతడు అనేక మహిమలు చూపుతూ ఆధ్యాత్మిక రాజ్యాన్ని పరిపాలించాడు.

ఆనాడు బసవేశ్వరుని ప్రభావంవల్ల ఎందరో భక్తాగ్రేసులు తమ అనన్య భక్తిని చాటుతూ ఈశ్వర సాక్షాత్కారాన్ని పొంది తమ ఆత్మశక్తిని చాటుకున్నారు. వారిలో స్త్రీ, పురుష వయో బేధం లేకుండా వందలాది మహాత్ములు తమ మహిమలతో ప్రసిద్ధికెక్కినారు. వారు ఒక్కొక్కరు ఒక విధంగా దైవసాక్షాత్కారం పొందిన తీరు ఒక కథ, ఒక పురాణం, ఒక కావ్యం అవుతుంది. అలాంటి మహాత్ముల పుణ్యచరిత్రలను మొట్టమొదట ఆంధ్రలో పాల్కురికి సోమనాధుడనే మహాకవి 13వ శతాబ్దంలోనే "బసవ పురాణం" అను కావ్యాన్ని జాను తెలుగు, దేశీయ ఛందస్సులో ద్విపద కావ్యంగా రచించారు. ఆ తర్వాత తెలుగులో, కన్నడంలో మరి ఇతర భారతీయ భాషల్లో భక్తుల కథలను చాలామంది కవులు ప్రకాశింపజేసారు.

18వ శతాబ్ధంలో ఆంధ్రప్రదేశ్, కడపజిల్లా భవనాశి పురానికి చెందిన కవి గొబ్బూరి వీరసంగయ్య అను మహాకవి ఆర్యుల చరిత్రలను తొల్లిటికథలన్ని బసవభక్తుల నందరిని ఒకచోటచేర్చి పూలమాల అల్లినట్లు 300 భక్తుల కథలను **"బసవ పురాణసారం"** అను పద్యకావ్యంగా మూడు ఆశ్వాసాల ప్రబంధంగా (340) పద్యాలతో హృద్యంగా రచించాడు. వీరి కవితాధార అప్రతిమానమైనది. వీరి శైలి సరళమై, మధురమై, భక్తిరస గంగలా ప్రవహిస్తుం టుంది. ప్రతిపద్యంలో ఒక భక్తుని కథ నాల్గుపంక్తుల్లో ముక్కుసూటిగా చెప్పడం గొప్ప సాహసమే. ఎంత పెద్దకథనైనా చిన్న పద్యంలో పొందుపరచే వీరి నేర్పు పదాలకూర్పు ప్రశంసనీయమే.

బసవపురాణసారము

ప్రస్తుత గ్రంథంనందలి పద్యాలలోనున్న కథలు **భైరవేశ్వర కథామణి సూత్ర రత్నాకరమను** సుప్రసిద్ధ కథాసంకలనగ్రంథంలోనిది. దీనిని వీరశైవ కవులు సంస్కృత, కన్నడ, ఆంధ్ర గ్రంథములలో విశేష భక్తి కథలను సేకరించిన సుప్రసిద్ధ కథాగ్రంథం.గొబ్బూరి వీరసంగయ్య వాటిలోని విశేషభక్తులకథలను తన పద్యములలో ఇమిడ్చి రసవత్తరంగాకూర్చాడు. మన పూర్వకవులు భక్తి సాహిత్యంలో సాదుసంపతుల కథలను వ్రాసినట్లే సంగయ్య వీరశైవ భక్తుల కథలను కావ్యరూపంగా అందించారు. పాల్కురికి సోమనాధుని **గణసహస్ర మాలిక** వలె వీటిని చదివినా, విన్నా, పారాయణం చేసినా మోక్షం లభించేటి దివ్యప్రబంధం.

ఇది ఒక అముద్రిత గ్రంథము. ఇంతకాలం కాలగర్భంలో కలిసిపోయినది.దీనిని ప్రముఖ పరిశోధకులు శ్రీ కపిలవాయి లింగమూర్తి ఎంతో శ్రమకోర్చి దీనిని పరిష్కరించారు.

బసవపురాణం సారం మానవజీవిత పరమార్థాన్ని ప్రభోదిస్తుంది. మానవ జన్మ అర్థం, పరమార్థం ఏమిటో తెలియజేసే భక్తి కావ్యం. భక్తుల మణిహారంగా, పాఠకులకు సుమనోహరంగా, శ్రోతలకు పుణ్యప్రదంగా, ముముక్షువులకు మార్గదర్శకం చేసే కైలాసపథగామినిగా, పరమాత్ముని కృపకు పాత్రులను చేసే పంచాక్షరీ మంత్రంలా సులభసాధ్యమైన ఈ కావ్యం ప్రతిఒక్కరు పఠించి తీరవలసిందే. బసవతత్వం బహుసులభమైనది. అందరికి అరచేతిలో కైలాసం చూపుతుంది. ఈ తత్త్వాన్ని అందరూ అలవరచుకొని భక్తితో భగవస్సాన్నిధ్యాన్ని చేరుకోవచ్చు. దేనిని పొందాలని మనం ఆరాటపడుచున్నామో పరమాత్ముని దయగల్గినచో మనకు సర్వం సిద్ధించును. కావున ఈ కావ్యాన్ని ఆమూలాగ్రం చదవగలరని కోరుతూ, శరణులై వెలిగిపోవాలని సర్వేశ్వరుని కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తూ బసవేశ్వరుణ్ని స్మరిస్తూ....

**రుష్యశ్రీ నాగలింగ శివయోగి**

జడ్చర్ల

# అపూర్వప్రబంధం

ఇదొక అపూర్వప్రబంధం. శివ శ్రీ నాగలింగశివయోగి గ్రంథభాండాగారం నుండి బయటపడిన శివమణి ఈ బసవపురాణసారం ఈ ప్రబంధంలో కందాన్ని గీతంగాను, చంపకాన్ని ఉత్పలంగాను వ్రాయబడిన పద్యాలు కూడ ఉన్నవి. గ్రంథంలో అనేక శబ్దదోషాలు, గణభంగాలు, గ్రంథపాఠాలు ఉన్నా సరిచేయడం జరిగింది.

గ్రంథకర్త ఈ కావ్యంలో విశేషవృత్తాలు చాలా వాడినాడు. కాని అవన్నీ ఏయే లేఖకుల దోషమో గాని ప్రస్తుతం అన్ని విషయవృత్తాలుగానే ఉన్నవి. వానినన్నింటిని గణభంగాలు లేకుండా సరిచేయడం జరిగింది.

ఇది శైవపురాణాలు మరియు పురాతన భక్తులకథలన్ని భాగా శోధించి నిదానంగా పరిష్కరించవలసిన రచన. కవి ప్రౌఢుడే కాని వ్యాకరణ విరుద్ధాలక్కడక్కడ చోటు చేసుకున్నవి. అవి వ్యాకరణ విరుద్ధాలనటం కంటే ఆనాటి భాష అనడం సబబు అవిమినహాయిస్తే ఇక గ్రంథపాఠాలవిషయంలో అక్కడ లిఖించిన అక్షరాలు, దత్తపదాలుగా పెట్టుకొని వానిని పూరిస్తూ పోవలె. కనుక శివపురాణకథలు సంపూర్ణంగా తెలియకుండ ఇది సుసాధ్యం కాదు. ప్రస్తుతం పద్యాలలో సామాన్యదోషాలు, పాదభంగాలు మాత్రమే చూసి విశేషవృత్తాలకు దాని పైన గణప్రస్తారం మరియు యతిస్థానం సూచించబడింది.

పండితులైన వారు ఆయా గణభంగాలకుకాని, గ్రంథపాఠాలకుగాని తమకు తెలిసిన పాఠాలు సూచిస్తే వానిని శివయోగిగారు కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించి దీనియొక్క పరిపుష్టమైన ప్రతిని మనకు మరొకటి అందించగలరని ఆశిస్తున్నాను.

వాణీసదనం
17-110
నాగర్‌కర్నూలు-509209
తేది:03-11-06.

ఇట్లు
సాహిత్యారాధకుడు
**కపిలవాయి లింగమూర్తి**

# రమణీయ ప్రబంధం

బసవపురాణసారము అనే అముద్రిత గ్రంథము ముద్రింపబడుట అత్యంత హర్షదాయకము. బసవేశ్వరుడు 12వ శతాబ్దంలో మానవాళికి నూతన రతిన తత్త్వోపదేశము చేశారు. దానిని ఆనాడు అందరూ అనుసరించారు. కరస్థలమునందు సద్గురువుచే అనుగ్రహింపబడిన లింగము నుంచుకొని అర్ధనిమీలిత నేత్రములతో అనిమిష(త్రాటక) యోగమును బసవేశ్వరుడు తెలిపిన రీతిన అభ్యాసము చేసిన ఎందరో సుఖమయ జీవితం గడుపుటేగాక లింగాంగసామరస్యమును సాధించారు. ఆధ్యాత్మికోన్నతికి అనువగు షట్‌స్థలములలో చివరిదగు ఐక్యస్థలము చేరుకొని జీవన్ముక్తులైనారు.

బసవేశ్వరుల వారి గూర్చి ప్రథమముగా బసవపురాణము తెలుగు భాషలో పాల్కురికి సోమనాథుడు రచించారు. కన్నడం లో భీమకవి, సంస్కృతంలో కంచిశంకరుడు, పద్యరూపంలో పిడుపర్తి సోమన, వచనరూపంలో అక్కిరాజు రమాపతిరావు మూలన్ననుసరించి వ్రాశారు. అలాగే గొబ్బూరి సంగయ్య బసవపురాణ సారము వ్రాసిన నేటివరకది ముద్రింపబడలేదు. దీనితో బాటు అనేక అముద్రిత గ్రంథములు మరియు అమూల్య ముద్రిత గ్రంథములు పూజ్య శ్రీ నాగలింగ శివయోగి గారు వ్యయప్రయాసలతో సేకరించి భద్రపరిచారు. ప్రస్తుతము ముద్రణగాంచుచున్న బసవపురాణసారములో ప్రతి పద్యమునందు ఒక ప్రమథుని గూర్చి వివరింపబడినది. అందుచే దీని పఠనము ద్వారా చెన్నబసవేశ్వరుడు మడివాళమాచయ్య మున్నగు మహిమాన్విత శివశరణులను స్మరించుకొనుట జరిగి చదివిన వారికి శుభఫలితములు చేకూరును.

పూజ్యశ్రీ నాగలింగ శివయోగి గారు రుష్య శివయోగిగా పిలువబడుతూ పరిశోధకులుగా ప్రసిద్ధిచెందారు. యోగపై వీరు ప్రత్యేకముగా పరిశోధన జరిపి వినూత్న శుద్ధయోగమును కొనుగొని శుద్ధయోగ పరివార్, యోగాలయం ద్వారా ప్రచారము చేస్తున్నారు.

బసవపురాణం గూర్చి కూడా వీరు పరిశోధించి ఎందరికోతెలియని వాటిని విశదపరిచారు. పాల్కురికి సోమన బసవపురాణంలో వీరశైవ అనేపదం ఎక్కడా లేదు శుద్ధశైవం అని మాత్రమే గలదు.

ప్రచురితమగు బసవపురాణ సారము గ్రంథములు ఎల్లరూ ఆదరించుటజరిగి తద్వారా మరోగ్రంథం బసవనపై వెలువరించుట జరుగాలని ఆశిస్తున్నాను.

శుద్ధ శైవమితి ప్రోత్రం వీరశైవ మతః శ్రుణు
సర్వేషమపి శైవానాం వీరశైవం మహత్తరం॥

(వీరశైవాచారిప్రదీపక)

విశ్వలింగాయత్‌పరిషత్
తేది: 23-10-2006

**కొండా బసవరాజు**

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

# అనంగరత్నం

18వ శతాబ్ద కాలంలో గొబ్బూరి వీరసంగయ్య పాల్కురికి సోమనాథుని బసవపురాణనానికి - బసవపురాణ సారమనే పేరున పద్యకావ్యం రచించాడు. ఇది మూడు ఆశ్వాసాల గ్రంథం సోమనాథుడు చెప్పిన భక్తులు కథలను ఒక్కొక్క పద్యం ఇమిడించాడు. ఇతని రచనలో కందములు, సీసములు శార్ధూలములు, చంపకమాలలు, ఉత్పలమాలలు మత్తకోయిలలు, తేటగీతులులు, ఆటవెలదులు, లయగ్రాహి, పంచమరము, తరలం ఉత్సాహం, హంసయానం, స్రగ్వణి, రగడ, దంచేకం, వృత్తాలు చోటు చేసుకున్నాయి. పండిత పామరులకు సైతం అర్థమవుతుంది.

శ్రీ జగదాంబనూ, లంబోదరున్నీ, శంభున్నీ స్తుతించాడు. ఆ తరువాత పాల్కురికి సోమనాథున్నీ, భీమసుకవినీ, శ్రీ శంకరాచార్యున్నీ, యతీంద్ర శ్రీపడక్షరున్నీ, విడుపర్తి సోమననూ, ఆమనగంటి బసవప్రభువునూ, చెన్నబసవేశునీ, హరిహరాచార్యులనూ, రాఘవాంకున్నీ, చామరసునూ, నన్నయాచార్యున్నీ, చిక్కనంజాచార్యున్నీ, పద్మరసునూ, విరూపాక్షున్నీ, చినమల్ల శివలింగాన్నీ, చిట్టుమచివాలున్నీ.- అనేక కవులందరిని స్తుతించాడు.

ఇతను కందనవోలు ( కర్నూలు ) ప్రాంతములోని ఎమ్మిగనూరుకు సమీపాన ఉన్న భవనాసి నివాసి. నేడు ఈ భవనాశి- భనవాసిగా వ్యవహరింపబడుతుంది. ఇతని వంశం కర్లివంశం తండ్రి మల్లప్ప.

"బసవపురాణసారంబు ప్రమదులకొక్కొక్క పద్యంబుగా తత్ప్రభావసహిత" అని చెప్పుకున్నాడు.

ప్రతి లింగధారి చదవవలసిన గ్రంథము. ఇది

**చొక్కపు నారాయణస్వామి**

సాహిత్యపరిశోధకుడు

తేది: 16-10-06

కర్నూలు.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

# బసవమహిమ

భారతీయ సంస్కృతి సాహిత్యసాగరం రత్న రాసులతో నిండినది. ఆ రత్నరాసులలో అత్యంత మహత్యం కలిగినవి పురాణములు. ఇది అమూల్యమైన నిధి. పురాణాలతో మానవజీవితం ఉచ్ఛ స్థితి తీసుకొని వచ్చె అనేక సరళ, సుందర మరియు చిత్ర విచిత్ర కథలతో నిండి ఉంటుంది. ఈ కథలోని తాత్పర్యం రాగ ద్వేషరహితం కలిగివుంటుంది. దీని ద్వారా మన కర్తవ్యపాలన చేస్తూ భగవంతుని ప్రాప్తి కూడా సిద్ధించును. మహాభారతంలో

శ్లో॥ పురాణసంహితః పుణ్యః కథ దర్మార్థ సంశ్రితః ।

పురాణములు పవిత్రకథలు ధర్మం మరియు అర్థం ఇచ్చేవి. అధ్యాత్మ దిశలో అగ్రస్థానంచేరుస్తున్నవి

శ్లో॥ ప్రథమాం సర్వశాసర్వశాస్త్రాణాం పురాణం బ్రహ్మణస్మృతమ్ ।
అనంతరంచ వక్త్రాభ్యో వేదాశాస్త్రస్య వినిర్మితాః ॥

( వరహపురాణం 1-60 )

తా॥ బ్రహ్మ దేవుడు శాస్త్రములలో మొదటిసారి పురాణములనే స్మరించాడు. తరువాత తన నాల్గు ముఖములతో వేదాలను ప్రకటించాడు.

శ్లో॥ యో విద్యాచ్ఛ తురోవేదాన్, సాంఙ్గోపనిషదోద్విజః ।
పురాణంచ విజానాతి । యః సతస్మాద్విచక్షణం ॥

తా॥ ఏ బ్రాహ్మణుడైతే సాంగ ఉపనిషత్ సహిత నాల్గు వేదాల జ్ఞానం కలిగి యున్నగాని పురాణములు ఎరుగడో అతడు విద్వాంసుడు కాదని పురాణవచనం

ఉదా: ఇతిహాసపురాణం ।పంచమం వేదానాం వేదం ( చాందోగ్య ఉపనిషత్-7-1-9)

తా॥ ఇతిహాసపురాణములు గూడ వేదమే అనగా పంచమ వేదమని ఒప్పుకున్నారు. పురాణము పఠనము వలన పుణ్యమే గాదు, మోక్షము గూడ లభించగలదనియు మన మహర్షులు చెప్పారు.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

శ్లో॥ యే పఠంతి పురాణాని । శ్రుణు వంతిచపమాహితాః
ప్రత్యక్షరం లభంతేతే । కపిలాదానజం ఫలమ్
అపుత్రోలభతే పుత్రః । ధనార్థిలభతే ధనమ్
విద్యార్థిలభతే విద్యాం । మోక్షార్థీ మోక్షమాప్నుయాత్
యే శ్రుణువంతి పురాణాని- కోటి జన్మార్జితం ఖలు
పాపజాలం తుతేహిత్వా- గచ్ఛంతి హరిమందిరమ్
( పద్మ, బ్రహ్మాండ 24,29,31 )

తా॥ ఎవరైతే ఏకాగ్రతతో పఠనం, శ్రవణం చేస్తారో వారికి ప్రత్యేక అక్షరము, కపిలగోవుదానఫలము లభిస్తుంది. పుత్రహీనులకు పుత్రులు, ధనార్తులకు ధనము, విద్యార్థులకు విద్య, మోక్షార్థులకు మోక్షము మరియు విన్నవారికి కోటిజన్మకృత పాపములు నశించును.అలాగే భగవద్ధ్యాన్యానికి చేరువవుతారు. ఈ పురాణపఠన శ్రవణం వలన సర్వసిద్దులు లభించును.

## బసవమహిమ

శ్లో॥ యస్య వక్త్రేస్థితం దేవి
బసవేత్యక్షర త్రయం
వసామి సతతం తత్ర
సత్యం సత్యం వదామ్యహం ॥
ఒకారో గురు రూపంచ
సకారో లింగ మేవచ
వకారశ్చర రూపంతు
త్రివిధం బసవాహ్వయం॥

తా॥ ఓ పార్వతి సత్యం సత్యం చెప్పుచున్నాను ఎవరి యొక్క వక్త్రమందు బసవ యని మూడక్షరములుండునో అచట నేనెప్పుడు నివసించుచున్నాను. బ కారము గురురూపము. స కారము లింగరూపం, వ కారము జంగమరూపం ఈ మూడున్న త్రివిధము బసవనామము – స్వయంభూ ఆగమము.

తేది: 24-11-06
హైద్రాబాద్.

శ్రీమతి హేరూర్ శోభావిజయ్‌కుమార్

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

# బసవ రసగుళిక

యుగావర్తేషు శిష్యేత
యోగాచార్య స్వరూపిణా
తత్రతత్ర త్రావతీర్ణేన
శివేనైవ ప్రవర్త్యతే
( వాయవీయసంహిత 4-32-13 )

తా॥ నాలుగు యుగముల కాలచక్రము తిరుగుచుండగా ఆయా సమయములలో యోగాచార్య రూపంలో శివుడే అవతరించి దానిని జనులకు నేర్పుచున్నాడు.

బసవేశ్వరుడు వీరశైవ భక్తి ఉద్యమాన్ని నడిపిన భక్తాగ్రేసరుడు. కుల,మతవర్గరహిత సమాజం కోసం తపించినవాడు. మానవులంతా ఒక్కటేనని తనవచనాలతో ప్రవచించినవాడు. ప్రజలను భక్తిమార్గంలో నడిపించేందుకు దీక్షాకంకణబద్ధుడై ఆధ్యాత్మిక భావాలను వెదజల్లినవాడు. ఆ బసవేశ్వరుని ప్రవచనాలకు ఆనాటి ప్రజలు మంత్రముగ్ధులై తన్మయత్వం పొందారు. బసవేశ్వరుడు అనేక మహిమలు చూపుతూ భక్తులను లింగధారులుగా చేసి కృతాకృత్యుడయ్యాడు.అలాంటి బసవేశ్వరుని గురించి ఎందరో కవులు ఎన్నో కావ్యాలుగా మలిచి బసవతత్త్వానికి వన్నెతెచ్చారు. వారిలో పాల్కురికి సోమనాథుడు **బసవపురాణం** అనే ప్రసిద్ధమైన వీరశైవ కావ్యాన్ని రచించాడు.

బసవపురాణం బసవేశ్వరుడి చరిత్ర.బసవేశ్వరుని గురించి మొట్టమొదటిసారిగా తెలుగులో వ్రాసిన కవి పాల్కురికిసోమనాథుడు. దీనిని ఆయన ద్విపదలో రచించాడు. కన్నడలో భీమకవి పద్యరూపంలో రచించాడు. బసవేశ్వరునిచరిత్ర తమిళం,హిందీ,సంస్కృత భాషలలో అనువాదమై ప్రసిద్ధ గ్రంథంగా పేరుపొందింది.తెలుగులో పద్యరూపంలో గొబ్బూరి వీరసంగయ్య అద్భుతంగా శరణకథలను రచించి వీరశైవలింగాయత్ సాహిత్యానికి వన్నెతెచ్చాడు.ఈ గ్రంథంలో అద్భుతమైన మూడువందలకు పైగా రసగుళికల్లాంటి కథలు మనల్ని ఆశ్వాసాంతం చదివిస్తాయి.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఇది అముద్రితమైన రచన. దీనిని వెలుగులోకి తెచ్చారు గురువులు నాగలింగ శివయోగి. ఇంతకాలం కాలగర్భంలో దాగిపోయిన ఈ అనంగరత్నాన్ని వెలుగులోకి తీసుకురావడం అభినందనీయం. ఈ **బసవపురాణసారం** ప్రచురణ భాగ్యం మా **పాలమూరు సాహితి** కి కల్పించడం అదృష్టంగా భావిస్తున్నాము. యోగగురువులు **రుష్యశ్రీ** నాగలింగ శివయోగి గారికి శతకోటి ప్రణామాలతో...

**భీంపల్లి శ్రీకాంత్**
అధ్యక్షులు
**పాలమూరుసాహితి**

తేది: 07-01-07
పాలమూరు

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



# గోరంత హారతి

**బసవేశ్వరుడు** అవతారపురుషుడు. నాటి బిజ్జలుని ఆస్థాన మహామంత్రిగా ఉండి పరమపావనమైన శివపరాత్పరుడి యొక్క పరమాత్మ తత్త్వజ్ఞాన బోధనను ప్రజలందరికి పంచి ఇచ్చిన పరమ నిష్ఠాగరిష్టుడు. లింగారాధనలోని పరమౌచిత్యాన్ని అందులోని భక్తి తత్పరతను జనబాహుళ్యపు మనస్సు లోతుల్లోకి జ్ఞానఘృతిలా వంపి, వారిలో భక్తి ఉద్యమ దృక్పథమును విజ్ఞాన జ్యోతులను వెలిగించిన మహనీయుడు. ఆయన ప్రవచనాల ప్రభావం వల్ల ఎందరో తమ ఆత్మతత్వాన్ని తెలుసుకొని, లింగధారులై పరమాత్మ ప్రభావానికి లోనై ఈశ్వరసాక్షాత్కారులైనట్లు చరిత్రలు చాటుతున్నాయి. బసవేశ్వరుని యొక్క అనేకానేక మహిమలు విశ్వవ్యాప్తమై ఎన్నో పురాణాలు, కథలు, కావ్యాలుగా మలుచబడి ఎన్నో భారతీయ భాషలలో రచించబడినవి. మొదటగా బసవపురాణమను కావ్యాన్ని తెలుగులో పాల్కురికి సోమనాథుడనే మహాకవి 13వ శతాబ్దంలో ద్విపదలో వ్రాశారు. దీనిననుసరించి మరెన్నో కావ్యాలు ప్రకాశింపబడ్డాయి. జీవితపరమార్థసారాన్ని ప్రబోధిస్తున్న ప్రస్తుత **బసవపురాణసారం** అను ఈ గ్రంథము 18వ శతాబ్దానికి చెందిన అపూర్వ పద్యకావ్యం. ఇది గౌబ్బూరి వీరసంగయ్య అను మహాకవి విరచితము. అయితే ఇది ఇన్నాళ్ళూ కాలచక్రమనే సాగరగర్భంలో దాగి ఉండిన అమూల్యరత్నం. ఈ అనన్య రత్నాన్ని తన ప్రత్యేక పరిశోధన ద్వారా సముద్రగర్భం నుండి వెలికితీసి దీనికొక ప్రత్యేకతను సమకూర్చి ఈనాటి జనబాహుళ్యానికి అందించే అపురూప ప్రయత్నం చేస్తున్న గురుతుల్యులు పూజ్యశ్రీ **నాగలింగశివయోగి** గారు సదా అభినందనీయులు. వారి ఈ కృషి హర్షించదగినది. ధర్మావలంబులై, సకలజనుల హితమునుకోరి నాడు బసవేశ్వరుడు ఏర్పరిచిన ఈ బసవధర్మసారాన్ని తన పరిశోధనాపటిమతో పునః వెలుగులోనికి తీసుకువస్తున్న యోగాభిలాషులు **శ్రీ రుష్యశివయోగి** గారు ఎంతైనా కృతజ్ఞులు. ఇది ఒక యజ్ఞం. ఇందులో పాలు పంచుకున్న ప్రతి ఒక్కరు ధన్యులు. యోగాశిక్షణే పరమావధిగా ఎంచుకొని శుద్ధయోగాశ్రమాన్ని నిర్వహిస్తూ నిత్యం యజ్ఞయోగ ప్రజ్వలనగావిస్తున్న రుష్యశ్రీ నాగలింగశివయోగి గారిలో నాటి బసవేశ్వరుని యొక్క కృపాంశ ప్రవేశించి ఈ మహత్కార్యానికి శ్రీకారం చుట్టిందని భావిస్తున్నాను. ఇది రుష్యశ్రీ వంటి కొండంత వ్యక్తికి నేనిస్తున్న గోరంతహారతి. నాకు ఈ అవకాశాన్ని కల్పించిన సాహితీ మిత్రుడు **శ్రీ భీంపల్లి శ్రీకాంత్** గారికి కృతజ్ఞతాభివందనములతో.......

**పాలమూరు యువసాహితీ కెరటం**
**ఎన్.వి. రఘువీర్‌ప్రతాప్**
తేది: 07-01-2007

**మన్మనాభవమందిరం,**
**6-81/1, టీచర్స్‌కాలనీ,**
**మర్లు, మహబూబ్‌నగర్.**
**సెల్: 9440551552.**

## కృతజ్ఞతలు

బసవపురాణసారం గ్రంథానికి తన అమూల్యమైన అభిప్రాయం వెలిబుచ్చిన **ఉరవకొండబసవ జగద్గురు** గారికి,

బసవపురాణసారం అమూలాగ్రం చదివి మూలప్రతి నుంచి ఎత్తి వ్రాసిన శ్రీ **అశ్విని లింగమూర్తి** మరికల్ గారికి,

దీనిని సాహిత్య మిత్రులు పండితులు శ్రీ **కపిలవాయి లింగమూర్తి** గారు చక్కగా పరిష్కరించి దీనికి తన అమూల్యమైన అభిప్రాయం వ్రాసిన వీరికి,

సాహిత్య మిత్రులు శ్రీ **చొక్కాపు నారాయణస్వామి**, చక్కని అభిప్రాయం వ్రాసిన శ్రీ **కొండా బసవరాజు** గార్లకు

దీనిని వెలుగులోకి తీసుకురావాడానికి ఆర్థికసహాయం చేసిన శ్రీ **డాక్టర్ రత్నపు గంగాధర్ గౌడ్** గారికి, యోగ శిష్యురాలు, నా కూతురు శ్రీమతి **హేరూర్‌శోభావిజయ్‌కుమార్** గారికి,

దీనిని **పాలమూరు సాహితి** ద్వారా వెలుగులోకి తీసుకువచ్చి తమదైనశైలిలోఅభిప్రాయాన్ని వ్రాసిన అధ్యక్షులు శ్రీ **భీంపల్లి శ్రీకాంత్**, ప్రధాన కార్యదర్శి శ్రీ **ఎన్.వి.రఘువీర్ ప్రతాప్** గార్లకు,దీనిని చక్కగా ముద్రించిన వంశీప్రింటర్స్ అధినేత శ్రీ **కె. శంకర్** గారికి,

ఇది వెలుగులోకి తీసుకురావడానికి అడుగడుగున సహాయ సహకారాలు అందించిన వారందరికీ...

కృతజ్ఞతలతో

**రుష్య శివయోగి**

జడ్చర్ల



## శ్రీ బసవ గురుస్తవం

ప్రమథ గణ నాయకత్వం ప్రమదరూప శ్రీవృషభేం
శరణ జన నయనానందం బసవం వందే జగద్గురం

సాంబశివ ఆజ్ఞాను వర్తిం మాదలాంబ ప్రతఫలరూపం
మాదిరాజ ప్రియనంతానం విప్రమార్గం విముఖాకారం ॥ప్రమథ॥

సంగమేశ సేవాతవరంగం షట్ స్థల జ్ఞాల స్వరూపం
జంగమాంఘ్రి సేవానురక్తం చరలింగ మోదక రూపం ॥ప్రమథ॥

కల్యాణీ ప్రాభవరూపం విప్లవాగ్ని నమచైతన్యం
చాళుక్య నృపధిక్కారం బిజ్జలేంద్ర గర్వాపహారం ॥ప్రమథ॥

చెన్నబసవ ప్రియగురు దేవం సర్వశరణ హృదిమందారం
అన్యవాద మానస సింహం గర్వ రహిత స్మితయుత వదనం ॥ప్రమథ॥

అగణిత మహిమాకారం లన్యధర్మ విముఖిత హృదయం
ఆది భక్తకృత పుణ్యరూపం ఆంతరాత్మ మోదక హేతుం ॥ప్రమథ॥

గొత్రసూత్ర పర్జిత హృదయం భక్తిగోత్ర మంగళ రూపం
కుల తత్వ వృక్షకుఠారం అత్యాశ్రామి తత్వస్వరూపం ॥ప్రమథ॥

అల్లమాది గురుజనస్తుత్యం మాచిదేవ ప్రియతమశిష్యం
సోమయ్య హృదినమ్మోదం మోక్షగామి వందిత పాదం ॥ప్రమథ॥

## బసవ గురుస్తోత్రము

పాహిమా శరణుబసవ పాహిమా శరణుబసవ
పాహిమా శరణుబసవ బసవ పాహిమాం పా॥
పుడమి పావనముగజేయ యలపుమీర మాదమాంబ
పడతి గర్భజ నితశైల బసవ పాహిమాం పా॥
దేవలిఖితమన బద్ద భువీశుడైన బిజ్జలుని
భావములరవిన గజదువు బసవ పాహిమాం పా॥
రజతగిరి నిహరుద్రు బసవ రాజుతాను ఏకమనుచు
భజన జేయును ప్రసన్న బసవ పాహిమాం పా॥
జొన్నలన్ని ముత్యముల జేసి జంగమయ్య వ్రతము
పన్నుగాను దీర్చినట్టి బసవ పాహిమాం పా॥
ఏపు మీరమిద్ర జంగ మేగుదెంచి వేశ్యనడుగ
పాపరహిత కొమ్మటన్న లీల పాహిమాం పా॥
నక్కలన్ని యశ్వములుగ యుదముమీర జేసి కృవున
కక్కజముగ జూపినట్టి బసవ పాహిమాం పా॥
మాలడన్న నాగమయ్య మహుని హస్తకమలమందు
పాలుపితికి జూపిసట్టే బసవ పాహిమాం పా॥
శివుని పుడు గరళమిడిన శబరులంత జూచిపాఱ
భవహరముగన మృత మొనగ్రు బసవ పాహిమాం పా॥
శరణ హృదయ కమల సుప్రచారు సుజననికర
భవునమాన అప్రమేయ బపవ పాహిమాం పా॥
బసవయన్న విన్నయవుదు భన్మమౌ నుదురితములును
బసవలింగ శరణు శరణు బసవ పాహిమాం పా॥

నోట్: పై స్తోత్రమును ప్రతి వీరశైవుడు కంఠస్థము జేసికొని సామూహిక భోజనం పంక్తికి ముందు పాడుకొనవలయును. ఇది మన సంస్కృతికి పట్టుకొమ్మ వంటిది.





## బసవపురాణసారము

కం॥ శ్రీజగదాంబను తలచెద
నీ జగమున వాక్యశుద్ధికిష్టాప్తికినై
సాజంబుగ వర్ణించెద
రాజాధర సతిని వాక్కు రాజిలుకొఅకై -1

కం॥ లంబోదర నినుగొల్చెద
అంబాసుతనీదు మహిమ లాశ్చర్యముగా
బంభారి ప్రముఖులును మో
దంబొందగ నాదు వాక్కు నస్పసియింపన్ -2

సీ॥ శ్రీశంభు మూర్తినా చిత్తాన వసియించు
కృతి యెనర్చుట కనుకూలమయ్యి
వచియింతు నీకృతి వరుస క్రమంబుగా
రచియించు శక్తినా రసన కిమ్ము
అసదృశ మహిమను విశదంబుగ నుతింప
రసికత్వమును మది రంజిలంగ
దిశలెల్ల బొగడనీ వసుధపై విలసిల్లు
పటిమను నామనః పంకజమున

తే॥ జ్ఞాన మనుబీజమును నాకు కరుణ జేసి
తత్త్వభావంబు మద్వాక్య తతిని నిలిపి
తేజమొసగంగ జేయవే దేవ దేవ
భావ జాంతక బస్మాంగ బసవ లింగ -3

శా॥ శ్రీకల్యాణ పురంబునం బసవ సంజీవ ప్రతాపాచలం
బైకన్పట్టు పదద్వయంబు నిడి భక్తస్థాన యానస్వనం
బాకర్ణించు శివానుభావులకు నిత్యారోగ్యమిప్పించు సు
శ్లోకుండెల్లెడ మమ్ము పాల్కురికి శ్రీసోమేశుడుం బ్రోవుతన్ -4

చ॥ బసవ మహత్వకల్పకము భామిని రూపముగానొనర్చి భ
క్త సభల కన్నడంబున సుగానమొనర్ప పదార్థ చిత్తులే
రసికుల వాంఛితార్థ నికరంబులు నీయగ జేయు నట్టి భీ
మనసుకవి మాకు నీవుత సమస్త మనోరథ భోగసౌఖ్యముల్ -5

శా॥ స్థైర్యంబౌ బసవ ప్రభావమును చింతారత్నమున్ గ్రంథ తా
త్పర్యాయంబగుపేటికందునిడి భక్తాగారముల్ జేర్చు చా
తుర్యార్థుల్ మదిగోరు వస్తువిడి యుక్తుల్ జేప్పు శ్రీ శంకరా
చార్యండీవుత నీప్సితార్థములు నిచ్చల్ మాకు మోదంబునన్ -6

చ॥ శరణులు గోరగా బసవచర్య మహత్తర దేవతాసభన్
దిరుగ పురాణ సూత్రముగ దెచ్చిన వృత్తము లర్థ చిత్తులే
సరసుల వాంఛితార్థము లొనంగగ జేయు యతీంద్రశ్రీషడ
క్షర ధనధాన్య వైభవ యశంబులు నీవుత మాకు సత్కృపన్ -7

ఉ॥ ఏరికి లభ్యమైన బసవేశు మహిమ్ము నిదాన లబ్ధముల్
గోరిన భక్తపుంగవులకున్ చరితాంజనమిచ్చి చూపగా
నారచనానుగమ్యుల ధనార్థ సలభ్యుల జేసి కీర్తివి
స్ఫూరితుడైన పిడ్పరితి సోమయ మాకు నభీష్టమీవుతన్ -8



మ॥ తమశుశ్రూష జనాళికెప్పుడును మోదంబొప్ప నైశ్వర్య సం
భ్రమ కీర్తుల్విలసిల్లు నట్టు లాశీర్వాదంబులన్నిచ్చి త
చ్ఛ్రమ నాపూజలుగొన్న బేమళిగె వాసున్ మద్గురున్ శాంతరు
ద్రమణిన్ చెన్న వృషేంద్రు నెప్పుడును నేదల్తున్ వచస్సిద్ధికిన్ -9

సీ॥ నిత్య షట్త్రింశతి నియమదాసోహంబు
సలిపినాడే లింగ చక్రవర్తి
పాదుగా షడ్దర్శనాదుల చేకొని
శరణంబులేలింగ చక్రవర్తి
చండిపాషండు లాఖండ దండనముల
సాధించెనేలింగ చక్రవర్తి
దినకర దీపదంధణభేరి బిరుదుల
చరియించెనేలింగ చక్రవర్తి

ఆ॥ కొలను పాక సోమగురు లింగ చంద్రికాం
బక వరంబుగొనియు సకల భక్త
వరచకోర శీతకిరణు డామన గంటి
బసవప్రభు దలంతు భవ్యముగను -10

మ॥ కలనైనన్ స్పృహలేక యుండి యతి మార్గం బొప్పగా జంగమ
స్థలయోగ్యుండనగా చరించి హరిదంత స్వచ్ఛ భక్ష్యాబ్జ తుం
దిలుడబ్జారను చంద్రశేఖరుల మూర్తిన్ శిష్యుడైనట్టి ని
స్తుల వైరాగ్య ధురీణు చెన్నబసవేశుందల్తు వాక్శుద్ధికిన్ -11

సీ॥ హరిహరా చార్యు హేమాచల సమధైర్యు
కవిరాఘువాంకు రాకాశశాంకు
లీల చామరసు వాచాలిత సారసు
నన్నయాచార్యు వేదాంత చర్యు
చిక్కనంజాచార్యు సేవితకవివర్యు
కెరయు పద్మరసు తార్కికుల నిరసు
శాస్త్రార్థ కుక్ష చెంచలి పేట విరుపాక్షు
చినమల్ల శివలింగు ఘనకృపాంగు

తే॥ కరిబసవశిష్యుడై నోలికావ్యశాలి
చిట్టు మడివాళు సత్కవి జనమరాళు
వీరశైవ పురాణముల్ విరచితేతి
హోసములు జేయు కవులనే నభినుతింతు -12

తే॥ చెన్నబసవపురాణంబు శైవదీక్ష
బోధలాంధ్రం బొనర్చి సత్పుణ్యులైన
హరపయకవీంద్రు పిడుపర్తి బసవశౌరి
దలతు మత్కృతి సత్ఫలదంబొనర్ప -13

వ॥ ఇట్లు గురులింగ జంగమ పాత్రంబును, సత్కవిజనస్తోత్రంబును, జేసి
మద్వంశాభి వర్ణనం బొనర్చెద -14



సీ॥ శ్రీగురుహస్తరాజీవజకుల కర్లి
వంశవారధికైరవ ప్రియుండు
మల్లప్పదాన ధర్మోల్లాసి యాతని
పుత్రులు ముపురువి చిత్రయశులు
సతత లింగార్చనాసక్త నిర్ణయనీతి
శాలి సముక్తుండు సంగవాఖ్యు
జంగమప్రాణుడర్చన ప్రసాదీశుండు
శీలాత్ముడగు మదివాలనామి

తే॥ భక్తతాత్పర్యగంభీరు బసవధీరు
డిందులోచాల ననుగారవించి చూచి
ప్రేమలిగురొత్త తానన్ను బిలిచి యిట్టు
లనియె నాతోడ మజ్జనకానుజుండు -15

కం॥ ద్యాసగ శివునిపూజకు అ
భ్యాసకుడవు నీమనిష్ఠ పరుడవు ప్రమథో
పాసకుడవు బుధజన వి
శ్వాసకుడవు పుత్ర వీరసంగశివాంగా -16

సీ॥ గురులింగ జంగమోత్కర పూజకుండునీ
యనుజుండు బసవ లింగాభిధుండు
సతతైక లింగ నిష్ఠాగరిష్ఠుడు భ్రాత
మదియప్పనూన సా మయికశాలి
శ్రాంతదీక్షాలింగశయన దాన నిదాన
శీలినీసోదరి శుభకదంబు
విబుధ మనోదార విభవుండు నిశ్రేయ
పరులు గొల్చెడువాడు బసవధరుడు

తే॥ యిట్టి వారలలోను వర్ణింపదగిన
రసికుడవు నీవు బసవపురాణసార
మింపుగా రచియించు మదీప్సితంబు
గట్టిగా దీర్చుకొఱకు నదెట్టులనిన -17

సీ॥ గంగోత్తమాంగుండు భృంగీశ్వరునకు ని
ట్లనియె మర్త్యమున నీవవతరించి
బసవాది ప్రమధు లేర్పడజేయు మహిమలు
విరచింపుమనగ పాల్కురికి సోమ
నారాధ్యుడైపుట్టి నారాజశేఖరు
భజయింపుచు నాంధ్ర భాషలోను
బసవపురాణ ప్రబంధంబు ద్విపదగా
జెప్పి యలంకార మొప్పగాను

తే॥ శంభు భక్తుల సభలోన జదువగా ప్ర
తాపరుద్రనరేంద్రుండు దగపరీక్ష
జేసి దృష్టాంతములను దర్శించి పుస్త
కమును వెలయించె తత్పురాణమును జూచి -18

సీ॥ శంకరాచార్యుండు సంస్కృతంబొనరించె
కర్నాట వృత్తసంగతి యెళేంద్ర
గ్రామషడక్షరస్వామియు రచియించె
భామినీ షట్పదిన్ భీమసుకవి
ప్రస్తరించెను పిడుపర్తి సోముండాంధ్ర
మునరచించెను పద్యములను నట్టి
బసవపురాణంబు ప్రమధుల కొక్కొక్క
పద్యంబుగా తత్ప్రభావ సహిత



ఆ.వె॥ నామ పఠనముప్ర ణామ పూర్వకముగ
శరణుజేసిపాలకురికి సోమ
నాధుపేర కృతియొనర్పు మదాజ్ఞచే
శుభములొందు నీకు సుస్థిరముగ -19

చ॥ బసవపురాణ సారము ప్రబంధముగా రచియించు భక్తితో
ప్రసవ శరాసనాంతకుని భక్త సభన్ వెలయంగ కీర్తి న
ల్దెసల సమోదితాత్ముడయి దీవనలొప్ప యభీష్టవస్తులి
చ్చుసుమి కృతీశు పాల్కురికి సోమగురుండనయంబు పుత్రకా -20

చ॥ అనిన ప్రమోద మంది వినయంబున మ్రొక్కియు నిట్టులంటి నీ
యనుపమ బేసికంటికృప నందితి యాతని భక్తులైన త
ద్ఘనులకు నొంటిగాయడుగు దమ్ములు రెంటికి మ్రొక్కగంటి నీ
యనుమతి వింటి నింక కలదా కలదా యిటువంటి సౌఖ్యమున్ -21

చ॥ ద్రుహిణి జనార్ధనాదులకు దోచనిశ్రీ మదనారి చర్యత
న్మహిమ సమగ్రమెన్న తరమానను బోటికి మత్కృతీశుడే
సహనము జేసి మాధురిరసంబులు నించిన యేనొనర్చెదన్
ఇహపర సౌఖ్యదంబు బసవేశ్వర దేవ పురాణ సారమున్ -22

కం॥ నిత్యంబులు భాగ్యార్జిత
సత్యంబులు మోక్షమార్గ సోపానంబుల్
పత్యంబుల మృతకామిని
రత్యంబులు ప్రమధనాధ ప్రకటస్తుతులన్ -23

కం॥ జయములు దనయాపారో
దయములు సంతత మభీష్ట దాయకములున
క్షయములు గోహర భటసం
చయములు గౌరీశు భక్త చరణాశ్రయముల్ -24

వ॥ అట్లుగావున భవదనుజ్ఞ ప్రకారం బేనొనర్చెదనని నమస్కరించి
తత్కృపాకటాక్ష వీక్షణోపేతుండనై మత్ప్రభుశు స్తోత్రంబు గావించెద -25

ముక్తపదగ్రస్తము

సీ॥ భసిత త్రిపుండ్ర సత్పాల పాది తరుద్ర
రుద్రాక్షభూషకారుణ్యప్రఘన
ఘనగురుధ్యానభక్తి నితంబనాలింగ
లింగాంగ కీర్తికాళీభుజంగ
జంగమదాసోహ సంశీల సహచర
చరణ తీర్థ ప్రాశ సద్విశేష
శేషప్రసాద భంజిత దూరగప్రపంచ
పంచాక్షరీమంత్ర ప్రమధ విసర

తే॥ సరణి వర్తన సత్పాత్ర చరిత శీల
శీల సంయుక్త దీనపోషిత శుభావ
భావ భవరిపుచరణ సద్భక్త పాల
పాలకురికీశ సోమేశ భవ మహేశ -26



'షట్‌స్తుతులు'

వ॥ అని యిట్లు వినుతించె -27

కం॥ శ్రీవీరశైవధర్మసు
ప్రావీణ్యాత్మునకు సతతపంచాచార
స్థావర యుక్త సుమహిత య
శోవరునకు పాలకురికి సోమేశునకున్ -28

కం॥ ధీరునకు మేరు వార్ధిగ
భీరునకును భక్తజనయభీష్టఫలద మం
దారునకును జనకుల తమి
సూరునకును పాలకురికి సోమేశునకున్ -29

కం॥ జాతి రజాతిరజోత్తిష్ఠకు సం
ప్రీతునకును పాతకాద్రి భిదురునకు సువి
ఖ్యాతునకు గురువచనసం
శ్రోతునకును పాలకురికి సోమేశునకున్ -30

కం॥ శాత్రవ షడ్వర్గలతా
పాత్రు శరీరునకు భవ్యపతిరీశ్వర స
ద్గోత్రునకు ప్రమధమణిగణ
సూత్రునకును పాలకురికి సోమేశునకున్ -31

కం॥ శరణునకుదీన మర్త్యా
దరణునకు మహేశ్వరాంఘ్రి ద్వంద్వంబు శిరో
భరణునకును నిర్ఘణ వి
స్తరణునకును పాలకురికి సోమేశునకున్ -32

కం॥ భువిచరసిత ఫలజలదా
న వచన పాకాద్య భావునకు షడ్సృష్టీ
ప్రవిమలశీల వ్రతునకు
నువివేకికి పాలకురికి సోమేశునున్ -33

వ॥ అత్యంత విజ్ఞాననోక్తి భక్తితాత్పర్యంబుల ననేక శిరస్సాష్టాంగ దీర్ఘ దండ
నమస్కారంబులు సమర్పించి యమ్మహేశ్వరుకృతి భర్తగా సమర్థించి
నాయొనర్పం బూనిన బసవపురాణ సారంబునకు కథాక్రమం
బెట్టిదనిన... -34

సీ॥ శ్రీహైమవతి గూడి సింహాసనమ్మున
నానందమున నుండ నంది భృంగి
యుపమన్యులాదిసామిపరాకు లనుచుండ
నంతలో నారదుండరుగు దెంచి
వినుతించి మ్రొక్కియిట్లనియెను మర్త్యలో
కమునందు నీ భక్తిగానరాక
జైన చార్వాకార్తి సమకూరె యందునీ
వవతరించిన శుభం బౌనటన్న



తే॥ నందికిని నాకు భేదమే నాడునైన
లేమిజేసియునాతని భూమియందు
పుట్టగా జేతునని బ్రహ్మపుత్రుతోడ
నాడుగౌరీశు పాదంబు లభినుతింతు -35

శా॥ స్వామీ నందికి నాకు భేదమొకలేశంబైన లేదంచ మ
ర్త్యా మౌనీశుని తోడజెప్పితివి తద్భవ్యార్థముల్ విందు స
త్ప్రేమన్ దెల్పగజేయు మంచు శైలాధీనాదు లాలించు చే
తో మోదంబున సర్వమంగళకు నేజేతున్నమస్కారముల్ -36

సీ॥ నగరాడ్దుహితవిను నంది మహాత్మ్యంబు
మాముఖాంశమున జన్మంబు నొంది
ధర్మరూపుండై కృతయుగంబున చతుష్ప
దముల నటించి త్రేతాయుగమున
త్రిపదంబులను వెల్గ ద్వాపర యుగమున
రెండుపాదముల వర్తించె కలియు
గమునొక్క చరణంబు నమరుద్వితీయశం
భుడనగ శిలాదుండు కదుతపించి

తే॥గీ॥ మావరంబున జేసికుమారుగాను
బడిసె నందీశ్వరుని నని భార్యతోను
బలుక వినిన యట్టి వృషభేశ్వరుని భార్య
పదములకు జేతు పదివేల వందనములు -37

ఉ॥ ఘోరతపంబొనర్పగను కుద్రజ బూని ప్రసన్నుడయ్యెనీ
కోరిక జెప్పుమన్న సుతుగోరి భవత్పద భక్తి పూర్ణగం
భీరునొసంగుమన్న వృషభేంద్రుని పుత్రునిగా నిడంగ తా
పేరిడి నందికేశుడని బిల్చిన తండ్రి శిలాదుగొల్చెదన్ -38

మ॥ సురలాశ్చర్యమునొందదైత్య ఫణిరాట్పుత్రామ గోవింద వా
గ్వరుల త్యద్భుతమంద నుగ్రతపమార్గంబొప్పగొల్వంద యా
కరుడై శంభుడు మందలించగను కాంక్షల్‌గోరకన్ సుందరో
త్కరసద్వాహనమైన నందికి నమస్కారంబుగావించెదన్ -39

సీ॥ నందికేశుని జూచి నగజామనోహరు
డనియె మర్త్యముననీవతరించి
మద్భక్తి మహిమ సమగ్రంబు వెలయంగ
జేయుమటన్న హర్షించిధరకు
వచ్చునంతట బాగె వాటికర్నాటదే
శమున శివార్చనా సక్త చిత్తు
సద్బ్రాహ్మణుడు పుత్ర సంతాన వాంఛచే
వృషభేంద్రవ్రతమును వెలయజేయ

ఆ॥ భార్య యుక్తముగ తపస్వాంతుడై నీమ
నిష్ట సలుప సతికి నెలయు దప్పె
శుభశకునములిట్లు జూచిన మెండుగా
మాదిరాజుదల్తు మదిని దినము -40



సీ॥ నందినోములునోమి నందీశు పుత్రుగా బడయగనాత్మ గర్భంబునందు
వర్షత్రయము మోసి తరముగాదని నందిగుడికేగి వినుతించి విడిది జేరి
నిదురించ కలనుసాన్నిధ్యుడై నందీశుడనె యోడకుము తల్లి జనన మాదు
పేరు బసవండని పెట్టుము నాకోర్కె సిద్ధించుననమేల్క జెందగాను

తే॥ గర్భమున నుండి పొత్తిటి యర్భకాకృ
తిని న గుదు యుక్తముగ జూచి తేజరిల్లి
బసవ బసవా యనుచు లాలి పాటబాడు
మాదమాంబిక పదములు మదిదలంతు -41

చ॥ బసవడు బుట్టినప్పుడు జపంబొనరించిన మంత్ర మూర్తియా
బసవనికింగురుత్వమున భస్మము చే ధరియించి యర్థితో
బసవని లింగదీక్షయుత భక్తికరంబులు నించి ప్రోవునా
బసవని హృన్నివాస ప్రణవ స్మరణం బొనరింతు నామదిన్ -42

శా॥ నమ్మంజాలక వచ్చితమ్మ బసవణ్ణాయంచు పేర్వెట్టి మా
దమ్మా కప్పడి నుందు నెప్పటికి లింగానర్పితద్రవ్య మీ
కమ్మా వీనికి జన్మజన్మముల సాయంబైన జాతీశుడన్
సుమ్మామర్వకుమంచు వేడెదు మహేశున్ దల్చి నేమ్రొక్కెదన్ -43

సీ॥ మాదాంబకును సంగమానాథ గురునకు
శివుడు తానయ్యును శిశువు నయ్యి
దొంగలు గట్టిన వంగకాయలు లింగ
ములజేసి యురుజంగములను జేసి
వటజంగమునకును విట జంగముకును
చీరలిచ్చియు యిల్లు చూరలిచ్చి
పెద్దభక్తుని యిల్లు వెదికియు జొన్నలు
పాలొర్చియును ముత్యాలొనర్చి

తే॥ కోరు సామికి కాలుజారుబామికిని కం
డ్లుండ జూపియు పడకుండ లేపి
శీలాన్నదీయంబు హాలాహలంబునీ
రంబు చేసియును శేషంబుజేసి

ఆ॥ పుట్టమ్రొక్కికలసి పూజభార్యవనిపు
నయ్యకిచ్చి జూడ మూడు కాళి
బోయలకు లొనర్చి భుజియించు బసవేశు
పదజలేజములను ప్రస్తుతించు -44

చ॥ ఉపనయనాది కర్మముల నొల్లక తండ్రిని ధిక్కరించి భ
క్తిపదము బట్టుకొంచు గురుదేవుని సన్నిధి జేరుభ్రాతవెం
ట పయనమునై ప్రసాదము దృఢంబుగ నమ్మిన యక్కనాగమాం
బ పదయుగంబు దల్చెద శుభంబులు చేకుర నామనంబునన్, -45



మ॥ తన మేనల్లుని ధర్మకీర్తనల నానందంబుగా జూచినన్
దనగంగాంబికనిచ్చి చంద్రధరు భక్తవ్యూహముల్ గూర్చి శో
భనవృత్తిన్ బసవేశు పెండ్లి సిరులొప్పంజేసి దర్భక్తి భా
వనుడై సంతసమందునట్టి బలదేవున్ మంత్రినిన్ మ్రొక్కెదన్ -46

ఉ॥ కట్టిన చీర జంగములు కావలెనంచు విభుండు వల్వగా
నిట్టటు బల్కకుండక పతివ్రతగావున భంగమొందకన్
పుట్టము విప్ప వేరొకటి పుట్టుచు నక్షయమైన కోకలున్
గట్టి యొసంగు శ్రీబసవకాంతకు మ్రొక్కెద గంగమాంబకున్ -47

సీ॥ బలదేవ మంత్రీశు గలసిన దాన బి
జ్జలరాజు బసవని బిలువ బంచి
బలముతో నేగి యంజలిజేసి మూడుబ
ర్వుల నెదుర్కొని కట్నములు నొసంగి
కలివైభవోద్యుక్తముల తోడ దా వచ్చి
కొలువు కూటమ్ము లోపల వశించి
వెలయు ప్రధానిగా నిలిపి చిత్రపుజగ
ములవెంటదోల్కపో వలయుననగ

తే॥ ఫలదదృష్టి సంజీవనముల నొసంగ
చలనులై యారగించియు వలచి మంత్రి
దలచి పండ్రెండు వేల సాములపదాంఘ్రి
జలజలములకేనొనర్తు మ్రొక్కులు మనమున -48

సీ॥ రాజశేఖరు పంపునను వెళ్లి బిజ్జల
రాజశేఖరుడు గోరంగ వచ్చి
కల్యాణ శరణ సంఘముగాంచి మ్రొక్కించి
ప్రభువల్ల తనకృపా పాత్రుజేసి,ప్రభునల్లమ కృపాపాత్రుడయ్యును మహీ
ప్రభువల్ల తనకృపాపాత్రుజేసి ఈశానయోగులకిష్టార్థ మిచ్చిమ
హీశాన యోగమూర్జిత మొనర్చి

తే॥ నట్టి బసవన దండేశు నంగణమున
యిష్ట మృష్టాన్న భుక్త సంతుష్టులై ప
దారు లక్షల తొంబది యారు వేల
మూర్తులకొనర్తు వందనాల్ మోదమునను -49

సీ॥ నిక్కినాడే స్వామి నిస్తుల మాయాస
కలమోహ తంత్రముల్ కాయపరచి
చిక్కినాడే స్వామి చిరతరగురులింగ
జంగమ దాసోహ శరణులకును
మెక్కినాడే స్వామి మితలక్ష షణ్నవ
సాహస చరభుక్త సంగ్రహంబు
ఎక్కినాడే స్వామి యీషణత్రయదూర
మగునట్టి శూన్య సింహాసనమున

తే॥ బసవ దండాధిపుని మెచ్చి భక్తిపథము
దెల్పి తన కరుణాంబుధి దేల్చి నట్టి
అల్లమ ప్రభుపాదంబులంబుజాత
ద్వందములకేనొనర్చెద వందనములు -50



శా॥ శూలిసభన్ భుజంగకరసూకరమేషహయోష్ట్ర సింహ శా
ర్దూల ముఖాద్యనేక ప్రమథుల్ వెలయంగ భవాని విందుకన్
కూలత భక్ష్యభోజ్యముల కొండలరీతిగ వండి యుంచ త
చ్చేలము శిష్యుడొక్కడె భుజించిన బాలగణంబుగొల్చెదన్ -51

సీ॥ గర్భంబులోనుండి కక్కయ్య శేషపు
భావంబు దెల్పెనే ప్రమథ వరుడు
శ్రవణజుండై రాజసభలోన బసవేశు
వీక్షించి మ్రొక్కెనే విభవ మూర్తి
ఘనదయన్ సిద్ధరామనకు సలింగిగా
దీక్ష గావించెనే దేశికుండు
గురులింగ జంగమ సరణినిషట్స్థల
వివరమేర్పరచెనీ భవవిదూరు

తే॥ డట్టి పరధార్మికుండు మృగాధిపుండు
భక్త సముదయ జలజప్రభాకరుండు
చెన్న బసవేశ్వర స్వామి చరణకమల
ములకునే జేతు సాష్టాంగ వందనములు -52

ఉ॥ అచ్చుగ వంగకాయలు ధరించుకమ్రుచ్చులు నింట జొర్రగా
హెచ్చరికయ్యి చూచి బసవేశుడు మజ్జనమాచరించి యో
సచ్చరితాత్ములారయన నజ్జల లింగములున్న లజ్జచే
నిచ్చపదార్థముల్గొను మహేశ్వరులన్నుతియింతు వేడ్కతోన్ -53

చ॥ నయనంబుల్‌గననొప్పి జేసినవి జైనా లింగముంజూపునీ
దయపాత్రుండన చిన్నమానికకు బోదండెచ్చి యివ్వంగ తా
నియమంబొప్ప భుజింప నప్పగను మాణిక్యంపులింగంబు శు
భ్రయశంబొప్పగ జూపెనంచు గొలుతున్ బల్లేశు మల్లయ్యనున్ -54

శా॥ పెంద్రూకే శివలింగమూర్తియనుచున్ పీఠస్థునింజేసి పా
ల్దెంద్రంచున్ బతితః పయః కలశమున్ దెప్పించి వండించగా
తంద్రేతెంచియు నింద జేసి శివునిం దన్నంగ కాలంటిగా
డ్దంట్రన్ పాదము దున్మకలు కోటయ్యంఘ్రులన్ మ్రొక్కెదనన్ -55

ఉ॥ మౌక్తిక రంగవల్లి శివమందిరమందు రచించు నద్రుతా
సక్తివచింపగా బసవస్వామి జలాంబకదృష్టి సృష్టిత
చ్ఛుక్తినిభంబులై వెలయు జొన్నలు ముత్యములైనగొంచు బ్ర
వ్యక్తముతో మహావ్రతము వర్తిలు జంగమవర్యుగొల్చెదన్ -56

ఉ॥ సంగమనాథుడే కుహన జంగమ మూర్తి వహించి పాలనా
కుంగరుణించుమోంబసవకోరికయున్న దటన్న బాపురే
అంగజభంజనా! యని యొకద్దము జూపగ మూడుకన్నులన్
పొంగుచు జూచినవ్వ ఫణిభూషణుడైన మహేశుగొల్చెదన్ -57



సీ॥ శివపూజకును నృపాలుని వనంబున పూలు
గొని మీదుగా బోవగనియు నావ
పునిజాన్నిగన విని పూజాఫలము వాని
బుట్టింతునని శూలి బూన్చు మాలి
కలపుష్పములు దెచ్చి యిలబర్వగా
వచ్చి నిర్మాల్యముల వీరు నిలచి తరుల
సుమములుగొని యాకసమునకేగగ
రాక పాదంబులును జిక్కు వడగ పెక్కు

తే॥ భంగులనుదల్ప చేతోభుజంగు డాశీ
ర్వాదమిడగా మహిమ్నాస్తవంబు జెప్పి
పుష్పములు గొనిపోవు శ్రీపుష్పదంతు
కంజదోయినొనర్తు నేనంజలియును -58

కం॥ నాళీకంబుల కాళ
వ్యాళుంబూజించి కృత్తివాసునకునునీ
వాళులొసంగి హరుని గను
చోళధరావిభుని గొలుతు శుభకరమొదవన్ -59

మ॥ శివలింగంబుల బూజసేయనుదకశ్రీగంధ మక్షంతలున్
నవపుష్పంబులు ధూపదీపతతులున్ నైవేద్య తాంబూలము
త్సవ పాద్యంబులుగా నొనర్తు నుసమస్తాలోపచారంబులి
చ్చి విభూతుల్‌గొను మంత్రి యా సకల శ్రేష్ఠుంప్రశంసించెదన్ -60

తే॥ రాజ్యమందెల్ల శంకరార్చనముజేయు
డనుచు చాటించి తత్కామ్యధనయశాది
విభవమిప్పించి వెలయు సత్రభుడనంగ
ప్రభుడరాయనీ పదములు బ్రస్తుతింతు -61

మ॥ బలుగానంబులుసేయ పిళ్లనయనార్ బ్రహ్మేశునాగారమం
దలసద్రవ్య కవాటముల్ దెరువగా దానొక్కటన్ బాడి కుం
డలి భూషున్ వినజేసి తల్పులును పూర్ణంబొప్ప మూపించెకే
వల భక్తాగ్రణుడంచు మ్రొక్కెదను నేవాగీశనైనారికిన్ -62

ఉ॥ మేడలు వంట శాలలుపమింపగ రాని శివాలయంబులున్
వేడుకతోరచించి తనవృత్తిని జంగమవాంఛితాన్నముల్
వీడిసకాయ కార్థమున నేమముతోనగజేశుగన్నయా
గోడలమల్లయాంఘ్రి నవకోకనదంబులకేను మ్రొక్కెదన్ -63

తే॥ పురుషుడిచ్చిన వాక్యంబు పొల్లుసేయ
కనుభవునకు తనూజశాకంబు నిడిమ
గుండ తత్పుత్రుబడసిన మహిమశాలి
సంగళవ్వ పదాబ్జముల్ స్మరణజేతు -64



సీ॥ పెర్మాడి రాజుకు ప్రియమైన మంత్రియై
సకలప్రపంచమున్ జరుపుచుండి
జంగమలోకలక్ష శతద్రవ్యము లొసంగ
గా రాజుదెమ్ము లెక్కలననంగ
పంచాక్షరి లిఖించి పటము చేతికినీయ
గాసత్పదార్థ సంగ్రహములుండ
తావెళ్లి యొక చోట దాసానిపువులెట్టి
గంధాక్షతముల లింగమును పూజ

తే॥ సేయగానొక్క గరుడ పక్షియును మాంస
బుద్ధిచేనోటితోగొనిపోయి మగిడి
శివుని దెచ్చియ్యగాను నర్చించినట్టి
కేశి రాజాంఘ్రులకును మ్రొక్కియు నుతింతు -65

తే॥ శంభునకు మూడు కాలముల్ సారసములు
వేయి బూన్పంగ నొకపూవు వెలితిగాగ
ఆత్మనేత్రాబ్జమిడగ పురారి వరము
గొన్నశివయోగి వీరచోళున్ని గొలుతు -66

మ॥ పదిలంబొప్పత్రికాలమీశునకు ధూపంబున్ సమర్పింప నొ
క్కదినంబందున లోపముం బొదమమై కండన్ బందింగోసి వే
సి దహింపన్ ఘనసౌరభంబు గొని మెచ్చీ శంకరుండేలు ధూ
పదమాచయ్య పదాబ్జమేను నస్మత్ఫాలంబునందాల్చెదన్ -67

ఉ॥ కావటతుంగభద్ర యుదకంబులు హుళ్ళరసోమమూర్తికిన్
సేవకుడౌచు నిత్యమభిషేక మొనర్ప జరాత్ముడయ్యునా
త్రోవను జారిపడ్డగని ధూర్జటి లేవగనెత్త వల్లెటం
గావడి మీదురాన్ వరము గాంచిన హొన్నయగారి గొల్చెదన్ -68

ఉ॥ మాపతి పద్మసంభవుడు మర్త్యులనెల్ల సృజించి బెంచ కా
శీపతిగాక యన్యులిక లేరని నిప్పులు కొంగులోన పృ
ధ్వీపతిమ్రోల తార్కికులు విస్మయమొందగ గట్టి నట్టియా
శ్రీపతి పండితయ్య పదసేవ యొనర్చి నమస్కరించెదన్ -69

కం॥ ప్రమధులురాగొని యాడుచు
ప్రమధేశునిచే యభీష్ట ప్రదమందుపురా
ణము మాయిభట్టు మృదుచర
ణములకు నేజేతువందనంబులు భక్తిన్ -70

కం॥ హరనాధజ్ఞుండయ్యును
నిరతము సద్భక్తి సల్పి నిష్కాపరుడై
పురమర్దను కృపగను శం
కరదేశుని గొల్చెదన్ త్రికాలములందున్ -71

మ॥ బలునవ్వించిన కాయకంబులును సద్భక్తాళిచేగొంచు దా
విలసిల్లంగ భవాని శంకరులు తత్పుత్రిన్ బరీక్షింపప
క్కలు కుట్టందరిసించి కాయికము దాగైకొన్న కాల్లజ్జము
చ్చులకున్ మ్రొక్కిదలంతు నెప్పుడును కాంక్షన్ బాటిలన్ భక్తితో -72



చ॥ తొడశివము ద్రగోధవుని ద్రుంచి హసించిన వేగి వర్యునిం
బొడచియు దండనాయకుని పొంతకునేగి మహేశ్వరాళికిన్
విడియములిచ్చు నేమమున వెళ్లుచు నుండి పొగడ్తకెక్కునా
అడవదరేచయాఖ్యు చరణాబ్జములంగొని యాడుచుండెదున్ -73

ఉ॥ జాలలచే మృగంబులను జంపగ వ్యాఘ్రము వెంటనంట శ్రీ
సాలమునెక్కిభూరిగను శంభునిమాదదళంబులేయకీ
లాలపుతిత్తిగారుచు జలంబభిషేకముగాగ శంకరుం
డేలిన భక్తుడంచునుతి యించెదనా శివరాత్రి శంకయన్ -74

సీ॥ వెలనా ి చోడని కులదేశికుడు చి
తర్కంబు సేయంగ దలచి పిలిచి
సభల న వేదశ స్త పురాణ ప్రా ణ్య
తను శంభుడే దెవ మనగ వినక
జాలకాసారి ం శ్వర మం రము నం
ధ్వజము గూల్చిన బ ద వరుని శ్ర ద
దేవుని పురికంపి దేవయ్య దేవయ
ఎ ను చోదండు పుత్రులిట్లు -7

తే॥ చేసిరని బల్కికండ్లను దీసినట్టి
రాజునకు శాపమిచ్చియు ద్రాక్షవాటి
జేరి కన్నులు ప్రమధాళి చేత వడయు
ఘనుని పండిత మల్లికార్జునినిగొలుతు -76

తే॥ శివుని సన్నిధికేగి దర్శించి మాట
లాడునేమంబు తోనుండ హరుడు బల్క
కున్నతెగ జూచుకొని భూషపన్నగుండు
మెచ్చుసు విధానికల్లయ్యనుచ్చరింత -77

సీ॥ ఫాలతలాంచిత భస్మత్రిపుండ్రపూ
తలను జూచియును వందనము జేసి
భక్తావమానదర్పమునెన్నిస్వర్గాది
పతులనైనను పరాజితులజేసి
పరగ దాసాదిగోపకశునసైంధవ
మణుల రుద్రాక్ష ధారణులజేసి
పూర్ణ నిష్కల లింగ పూజావసరముల
ప్రకటరాకేందు నర్తకుల జేసి

తే॥ దండు గూర్చుకనెను బదిరెండువేల
గుఱ్ఱములలోను కైలాసకు ధరమేగి
విక్రమ స్ఫూర్తి దుర్వార చక్రవర్తి
నేప్రణామంబులజేతు మనఃప్రపూర్తి -78

చ॥ బసవడు చెయ్యి జాచియును పట్టియదృష్టము జూపితా వచిం
పసభ వినంగ సొన్నలిక సీమను భక్తులు సిద్ధరామయీ
బసవడు రౌప్య శైలమున బాయక నుండెడు నన్నశూలి హృ
ద్బిసరుహమందు నుండెనని తెల్పిన కాళవకేను మ్రొక్కెదన్ -79



మం॥ త్రిపురాంతేశ్వరు తూర్పుదిక్కునను భక్తిన్నేమపూర్వంబుగా
కపిలేశుండును లింగమూర్తి కభిషేకం బూన్పనూర్పుట్లదై
నువమింపన్ ప్రియమందగాను హరి బాణుంజేరగన్నట్టి యా
తపసిందల్చియు మ్రొక్కుచుండెదను మోదంబొప్పనేప్రొద్దునన్ -80

రగడ॥సొన్నలి పురమున శూలిభక్తులును
(సొన్నాలపురము = షోలాపూర్)
చెన్నుమీరగ సిద్ధ రామయయను
కనివందనములుగావించియును
జనిరి మహేశ్వరునాస్థానము నీ
జాలయమగు రజితా చలమందున
బసవేశ్వరుడను భర్గుని కొలువున
వసియించున నేవార్త దెలియగను
చెప్పివేయగను సిద్ధరాములనె
యిప్పుడచటికే నేగెద వేగమె
చూచివచ్చితత్పూక్తులు మీకును
సూచన జేయుదు చొప్పు వహింపను
అనుచునుతారజితాద్రికి నేగగ
ధనదసఖునియాస్థానము జూడగ
రుద్రగణంబులు రూధిగ గొల్వగ
భద్రముగా మహాప్రమథులు గొల్వగ
సనకసనందన పల్మును లాదిగ
చనువునవచ్చియు హృదయాబ్జంబులు
బూన్పగనుపమన్యుండును కణ్వుడు
అగస్త్య కపిలశిలాముడు కౌశిక
శ్వేత దధీచి వశిష్ఠకళాదులు

గౌతమ బలులను కశ్యపసూతులు
మాండవ్యహారీతమార్కండేయులు
శాండిల్యుడు వత్సలుడు పులస్త్యుడు
గార్గశౌనకమృకండుడు భృగువులు
భార్గవమౌనల భాండక శునకులు
మైత్రేయుండును మంకణచవణులు
అత్రివరుణమిత్రాంగీరసులును
వామదేవసౌపర్ణనారదులు
జైమిని పులహులు శాకల్యాదులు
వేశక్తియు సుబ్రమణ్యుండును
పౌలస్త్యుడు రైభ్యక సత్యుండును
పైలసమంత సుపర్వసుమంతులు
మందపాలుడు సుమౌని మౌసలుడు
విందబల్లకి పవిత్ర వాణియును
దుర్వాసుండు చతుష్కరణుండును
శర్వాయని యంజలులు ఘటింపను
నరఖేచరదానవగంధర్వులు
సురగరుడోరగ సుప్రకరంబులు
సిద్ధులు సాధ్యులు చేరి మ్రొక్కుచును
బద్ధాంజలులై ప్రస్తుతింపగను
కరములు మోగిచేకాదశరుద్రులు
పరమార్థముగా పొందెడు స్తవములు
అష్టవసువులు మహానేమముగా
నిష్టతోడి సన్నిధి విలసిల్లగ



సురపాలకుడా సుక్షణిశమనుడు
నిరుతియువరుణానిలుడు కుబేరుడు
ఈశానుడు లక్ష్మీశుడు స్రష్టన
మోశర్వాయని సద్వినయంబుల
తోన భయంబులతోన భయంబులు
వేదగతుంబురు వీణాదులచే
పాడగనంబా పతియాస్థాన
మునను ముదంబున నందున దయగన
.................................
సేమము శివదేవు
.................................
శివదేవునిగని సిద్ధిరామయయు
సవినయ మొప్పగ సాష్టాంగుడై
మ్రొక్కుచు చేతులు మోడ్చుచు కేశవ
దిక్కమలార్చిత దీనోక్తులు నవ
ధారు యనుచు స్తోత్రంబులు జేసియు
చేరువకేగియు చిత్తగింపుమిట
వసుమతిలోన భవత్పద భక్తులు
బసవడు శూలి సభను వశించుట
చూచి రమ్మనగ సొంపు వహింపను
మీ చరణముల సమీపంబునకును
వచ్చితి ననగా వక్కాణించెను
యిచ్చటచ్చటన నేటికి నాలో
మీలోప్రమదుల మండలి లోపల
గ్రాలును బసవడు కనువారలకని
భావములోవెలి బాయకుండగని

సావధానియై సాక్షిజూడుమని
తనహృదయంబు ముదంబున దెలచిన
ఘనలింగము కరకంజాతంబున
నిడుకనిరీక్షణ నిష్టలు సలుపగ
కడునానందము ఖాంబుజ మొప్పగ
పద్మాసనుడై బసవేశ్వరుడును
పద్మభవత్పుత ప్రభృతియు బొగడగ
శక్రాదులు నాశ్చర్యము నొందగ
విక్రమమునతా విలసిల్లంగను
మేచక కంఠుడు మేనకజాతను
కనియిట్లనియెను కంటివె బసవని
ఘనమహిమోన్నతి కమల దళేక్షణ
ఈసముదయమున నీశుడటందుకు
మానని భేదము మాలోలేదని
బసవని తోడుత భవుడిట్లనియెను -81

సీ॥ అజకాలమునదక్ష యంతకప్రియ యామ్య
నిజగణజ్యోతుల నేభజింతు
ఈశానశర్వ సర్వేశ సురాధీశ
నలరు రుద్రేశుల నేభజింతు
వామదేవోగ్ర సంవాహాది వామదే
వాభవోద్భవులను నేభజింతు
ధాతవిధాతహుతాశన మహతేజ
నిజభక్త ధన్యుల నేభజింతు



తే॥ దర్పదారక యర్చి ష్మదమన భీమ
రణలయ క్రూర దౌంష్ట్రసూక్ష్మప్రచండ
దరవి తరణ గౌరీశుల స్థాణు సభను
నిత్య విలసిల్లు రుద్రులనే భజింతు -82

సీ॥ శరణముల్ జేతునే సహనేశగుహరౌద్ర
పంచశిఖనయోక్త బాధకులకు
అంజలుల్ జేతునే హరరత్నకరబభ్రు
హంతాగ్ని దుఃఖాపహారులకును
జోహారులేజేతు సుకర బ్రహ్మసుదంబ
రస్వామికి నమృతా హారులకును
దండముల్ నేజేతు చండీశగోపతీ
శానభయానక సౌమ్యులకును

తే॥ వజ్రదంత విరూపాక్ష వజ్రదేహ
అవ్యయ వియోగ వటశీఘ్రు హరిహరాఖ్య
రుద్రులు మహేశసభను సారూప్యులైన
వీరికిని జేతునే నమస్కారములును -83

శా॥ క్షేమీశావట రుద్ర హాలాహల విశ్వేశోగ్రకాలాగ్నిరు
ద్రామాతంగ సురంగ రోహిత పరంధామా కపాలధరా
భీమాకర్త్రభిదానకాలబి రుదాపింగాక్ష విత్తేశస
న్నామంబుల్ పఠియించి మ్రొక్కెదను హృన్నాళీకమందెప్పుడున్ -84

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ విషధరనిధీశశంభు
వృషభగణాద్వక్ష వాయువేగనివృత్తిన్
విషధర యక్షయరుద్రల
విషతాంఘ్రులకేను మ్రొక్కి వినుతి యొనర్తున్ -85

తే॥ శాశ్వితానంత యూర్థ్వకేశత్ర్యక్ష
శంభు పింగళ సాద్యవిచక్షత్రిదశ
స్థూల రుద్ర ఫణీంద్ర రుద్రులు మహేశ
సభవెలయు రుద్రగణముల సంస్మరింతు -86

సీ॥ శ్రీనంది నందినాధానంద చండీశ
యీశాన పుండరీకేశ సర్వ
సర్వజ్ఞ సర్వాత్మ శరభము ఖావీరవీరక
హయముఖవీరభద్ర
భద్రయారూప సుభద్ర మహాకాల
కాలకంధర మహాకాయ ఉగ్ర
ఉగ్రాక్ష భర్గా సితగ్రీవ మహశాంత
శాంతరూప వృషాంక శర్వరూప

తే॥ రూప విరూపాక్షరద్ర విరూపమాఖ్య
ముఖకపీనరశార్దూల ముఖులు భావ
భావ జిత్సభవెలసిన ప్రమధ తండ
తుండముల పాదములు దల్చి ధన్యునౌదు -87

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

సీ॥ దండపాణి వృషభరుండా భరణ రౌద్ర
పుండరీకేశ్వరం పుష్కలాంక
పర్వతా భరణ దర్పక భంగ సర్వసం
హరణదారుక దవళాక్ష లోక
విజయాట హాసాఖ్య త్రిజటి దూర్జటికాల
నిజబలవిషబల నిష్కళంక
నీలలోహిత నిత్య నిశ్శంక యుత్తుంగ
కాలమహాకాల, కాల కాల

తే॥ కరిముఖోష్ట్ర ముఖాయకగజహరముఖ
రౌద్ర ముఖ కాలముఖ సహస్రముఖ దుర్ము
ఖులను గౌరీశు కొలువులోపలవశించు
ప్రమధ నామంబులెప్పుడు పఠన జేతు -88

ఆ॥ విశ్వరూపలీల విజయ ఘంటాకర్ణ
పింగళోగ్రకాయ భృంగియుగజ
కర్ణ యశ్వకర్ణగోగజ శార్దూల
కర్ణులాది ప్రమధ గణుల దలతు -89

కం॥ పురహరయమ హరణగజా
సురహర విషయ హరణ సకల సురహరమృత్యుః
పరిహార ప్రమధులనామ
స్మరణన్నే జేయుచుండు షట్కాలములన్ -90

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

తే॥ అభిహరాసుర హర్యక్ష మఖహరాదు
లిందుశేఖరు సభను సానందశౌర్య
ధైర్యలీలల చేసదైశ్వర్యులైన
ప్రమధ నామంబులెప్పుడు ప్రస్తుతింతు -91

మ॥ హరపూజార్థము నొక్కనాడు చనిన వ్యాంబోజాతముల్దేగయా
బురవంజారి షడంగ పువ్వులు కరంబున్ బట్టి దీనంబుగా
వరదాయన్న శివుండు హస్తమున లేవంబట్టి రక్షించునా
చిరుచిట్టం బలదేవు దల్చి శరణార్థిన్ యంచునే మొక్కెదన్ -92

చ॥ బసవన మంత్రి జీతములు బంచగజూచి పదార్థమెల్లనా
కొసగుమటన్న స్వామిగ యికొమ్మని యిచ్చిన భూపుడాగ్రహిం
చిన ధనమొప్పగించు మన జిర్మత రంగకనుండు జూపు శ్రీ
బసవమహత్తు దెల్పు ఘనపుణ్యుని గొల్చెద మిండ జంగముల్ -93

ఉ॥ రాజుగురాలనుంగొనుచు రమ్మని ద్రవ్యములిచ్చిపంపగా
దాజని జంగమార్చన వ్రతంబులు దీర్చియు విత్తమంతయున్
పూజయొనర్చి వచ్చి నరపుంగవు కిన్కకు నక్కలన్నిటిన్
వాజులజేయునక్కనయనారికి నే ప్రణమిల్లిమ్రొక్కెదన్ -94

మ॥ ఘనకాంత ప్రభగాన వచ్చుటలు శ్రీగంగాంబపై చేలమి
మ్మనియాచింపగ దేవ కొమ్మనుచుతానైనదృతద్దేహశ్రీ
మననే కాక్షయవల్లలైన బసవన్మాహత్వముందచ్చుభన్
గనుపట్టంగొని వేశ్యకిచ్చు విటజంగంబున్ ప్రశంసించెదన్ -95



కం॥ బడయడు సతి వల్వ డుగగ
విడిపించగ విడువకట్టె వెలయుచునుండెన్
వడిదెలు నయ్యలకొసగిన
నిడుగుడినయనారిదల్చి నేమ్రొక్కెదన్ -96

లయగ్రాహి

॥ స్థాణుడొక విటరూప జాణయైచేతబలు
వీణ మీటుచును ప్రఘాణముకు రాగ
శ్రేణిలో లేచి శర్వాణి పతిమృదుపాద
శోణాబ్జములకెఅగనాణెముగ
.................................
యాణమై వచ్చి తనయాలి దెమ్మనగన్
ప్రాణ ప్రదమైన తన రాణిని నొసంగు భ
ల్లాణునకు మ్రొక్కెదను వాణి సంసిద్ధికిన్ -97

సీ॥ పుట్టముల్ నేసిగొబ్బున సంతకేగియు
విక్రయలబ్దంబు (వినయమునకు)
సలుపుచు నిధి నొక్క సంఖ్యతోడ
రాజార్థమై యొక్క రంగైన చేలంబు
నేశియమ్మియుగన నికర తృప్తి సలుపుచు
ననివాద శాబ్దముల్ రచియించి
గొంపోవ శివుడొక్క కుహన జంగమయ్యి
తద్వస్త్ర మిమ్మని యడుగ మారు
మాటలాడక నిట్టుట మసలకయునుటే
కోకనాసగియు తవనిధిగొన్న ధన్యు
డైనదేవర దాసయ్య నభిను తింతు -98

మ॥ సతతం బెప్పన గాయకం బయినయా సంజీవ రత్నంబుగో
రితినాకిమ్మని జంగమంబడుగ నిర్మాణాత్ముడుంగాక శ్రీ
ర్లతలంబున్ బెకలించి మానికము ధర్మంబివ్వగా సంభ్రమో
న్నతుడై శంభుడు మెచ్చు శోన్నయిడు నైనారింప్రశంసించెదన్ -99

**పంచచామరం**

సహస్రముల్ మాలుదాచి శంభుదర్వదేండ్లకున్
బేహోర్లరీతి మారువడ్డి బెంచగాను భక్తియే
వహించి యింటగల్గు ద్రవ్య పాత్ర యిచ్చి నంతలో
నహోర్య ధన్వి మెచ్చు మొన్నయాదరంభజించెదన్ -100

**కవిరాజ విరాజితం**

పుడమిని క్షామోత్పాతములెసగగపుట్టిన పుష్పశరాంతకులన్
కడుమధురంబగు పాయసపూపముఖాదన్నాంబ రముల్ దయతో
కుడువగ గట్టగ నిచ్చియు గాదెలు కొల్చుచు కొల్లగవిడుఘనుడో
నిడుగుడి పెర్మడి చరణముల నేజేతు నమస్కారములున్ భక్తిన్(ప్రేమన్) -101

సీ॥ వైవాహమున వధూవరులార్యబాషింగ భూషులై భరిత సంతోషలగుచు
వంది మాగదజన వ్రాత వేశ్యాజనుల్ పాడగ చూడగ నాడగాను
బంధు జనాధిప పరికర విభుధులర్థించగీర్తించ దీవించగాను
మలయజాక్షంతలు మంగళారతులును పూయగా వేయగా నీయగాను



తే॥ మృదుడు చరలింగమై పెండ్లి పడుచు కొప్పు
నడుగకచమణి లేక వంకిదియు నభ్ర
ముడు సమాహారదిన చంద్రులడర కోర్కె
బడయుశ్రీమానకం జారియడుగులెంతు -102

ఉ॥ అంగనవేదినన్ బసవడా సమయంబున వేశ్యనీయనా
లింగన కూటబంధనము లేమియు జేయక కేవలంబునన్
లింగమహాపదార్చనుడు లీలను సల్పిన యట్టి ముగ్ధడా
సంగమదేవు పాదమృదుసారసముల్ మదిలో భజించెదన్ -103

కం॥ త్రిపురారి విషము మ్రింగిన
ని పురాణము వినియు బెగది నీశుడు దలచిం
త పహారము జేయతొడలని
లు పురుద్ర పశుపతి నేదలుతు వాచోక్తిన్ -104

ఉ॥ భామ చెలంగి తూ పొడువ పత్ని వెడల్చిన లింగమూర్తి త
ఛ్ఛీమ చిదాంగ మన్యవెసచీమును నెత్తురుగారు చుండ పెం
గోమల తుంపరీడు మనగొంతివడంకగ నిర్మలాంగుడై
నామునుముందునక్కున యనారికి నే శరణార్థి జెసెదన్ -105

తే॥ శివునకును తల్లి లేదేమి సేతుననగ
బాలుడై శంకరుడు తన ప్రాపు నుండి
స్తన్యమిచ్చియు పోషించి చంకనెత్తి
దాచి ముద్దాడు బెజ్జమ దేవిదలతు -106

సీ॥ శివుడు మోసుకతేను శవము వండిమదాను
భవము కిమ్మనితేను పతినిబూను
మతితోడ చండాల సతియయ్యికరముల
మునగంప మెడపూల ముడుపుచాల
వక్కాలాకులనోరు లక్కగాజులతీరు
పెక్కు గవ్వల పేరు బిగువు మీర
నడుపుతోడుతరాగనగజేవులను యాగ
శాలలో శరణాగతాలవేగ

తే॥ దంపతులుపూజలా సుర దంపతులకు
జేసి యిష్టాన్న సంతుష్ట జేసిన ప్ర
సాదమును గొన్న మోదియా సామవేది
శరణు వనజాత యుగముల శరణు జేతు -107

తే॥ పతికి దాచిన దొంతిలో ఫలరసాల
ఫలములర్థించినట్టి మాయలభవునికి
వంచనములేక నిడియు సద్వరముగొన్న
తల్లియని కరికాళవ్వ దలతునెపుడు -108

ఉ॥ కుంచెడు పాలునీశ్వరునకు న్నయివేద్యము నిత్యమున్ సమ
ర్పించు మటంచు మాతయును పిత్రులు పల్లెకు బోయిరాగని
ర్వంచక భక్తితోడుత శివాభవ దుగ్ధములానుమంచు ద్రా
వించిన గోడగూచి మనవిన్న పదాబ్జము లేను మ్రొక్కెదన్ -109



కం॥ అడవిని గుడిలోపలయా
మృడునకు దిక్కెవ్వరంచు మొరపెట్టుచుదా
జడగాల్చి ప్రహరియునుది
గ్గెడి దీపదకళిని దలుతు కేవల భక్తిన్ -110

కం॥ పన్నుగ ముగ్ధకిరాతక
కన్నెలచే పూజజేసి శ్రీకంఠునకున్
కన్నిచ్చి వరములందిన
కన్నప్పను దలతు కోరికలు విలసిల్లన్ -111

సీ॥ కాలోపచార శృంగారార్చనల శూలి
పూజించిశ్రీగిరి బోయి భూతి
జంగమరుద్రాక్షలింగరూపములగో
త్రానదీతరుగుల్మ తరులజూచి
కాలత్రయముల లింగముల పూజించెదు
ఖగనరమృగముని గణము జూచి
బిల్వగొబ్బిలిక్రింద కొల్వుండిలింగావ
సరము జెల్లించగా సామి గొల్ల

తే॥ రూపమున వచ్చి గొల్చియు ధూప బసవ
దున్న కళ్యాణ పురమున కేగుచున్న
మోదమున మ్రొక్కు సకలేశుమాదిరాజు
చరణయుగధూళి దాల్తు మచ్చిరమునందు -112

కం॥ శంకర భక్తుల మృదుపద
పంకేరుహ షట్పదుండు భవదూరుండున్
సంకల్ప హరణుడ గునా
సుంకరి బక్కయ్య దలచుచుందు దినంబున్ -113

సీ॥ కలశ సహస్రోదకంబభిషేకంబు
తనయెత్తు ధూపమీశునకు నొసగ
పూజారులును దమపూజ దీసునటంచు
గుడితాళములు వేయ మృదుడు దెరవ
కనలినయ్యూర భిక్షములిడనీకున్న
భవుని నిర్మాల్య మర్పణము జేయు
ప్రతిగొల్వగను నవ్వి భస్మమర్పించుచు
నేమంబు జెరుపంగ పామరమున

తే॥ ధూపమును దాచ శ్రీనలధూప పాత్ర
లోననాసీనుడయ్యు త్రిలోక మెఱుగ
ఘంట మ్రోయంగ రే ప్యానగుంటజేరు
మోహితాఖ్యుని గొల్తు మాం పాహియనుచు -114

సీ॥ దంపుతుల్నెత్తంబు లింపుతో నాడంగ
దరహాసితుండైన తరుణుజూచి
నవ్వకారణమేమియన యోహిళుండు బ్ర
విధిళంబుదీటు కొంటి
గాయనగుడిక్కుఘంట మ్రోయించిన
నవ్వితినని మీరు మాడమలఱునినంబి
చెరయ బొమ్మయ శివుజేరుటలును
జెప్పినగు యెటు బోదును నాధయనగ



తే॥ పత్ని తోడుత చతురంగ బలము తోడ
నాట్యములు సేయు బహుళ వాద్యములు మ్రోయ
చిత్రముగ బోవు శివుజేర శ్రీకుమార
పాలకార్జును పదములు ప్రస్తుతింతు -115

శా॥ ఓరంగల్లు పురప్రయాణగమనప్రోల్లాస తత్పట్టణా
వ్యారా ప్రాంతల సద్భవిప్రతిమ యార్భద్రుప్రుంకల్ప వి
స్తారా స్వాంతు సలింగ నందియుగవార్త గ్రాహ్య మాలోజ్జకు
డ్యాగ్గ పూజాకరశైమహామతప్రకర ద్వారా కరైజై ?
వాత్సకభవపరీకర కదళి విశాల ద్రుతు శుండాలా ? -116

మాలిని ॥
ప్రమథ భజ కవీంద్ర భక్త కుముదౌఘ చంద్రా
అమితమహిమ మూర్తీ అష్టదిగంత కీర్తి
తిమతరితతి విదారాధీవరాత్మా విహార
సుమహితగుణ దక్షాస్తుత్య నిరతాముముక్షా -117

గద్య ఇతి మద్దురు లింగజంగమప్రసాదలబ్ధగణ పర్వోల్లాస భవనాశ పురీశనివాస భక్త మహేశ్వర పాదపంకేరుహ భవనాశపురీశ నివాస భక్త మహేశ్వర పాదపంకేరుహభృంగ వీరసంగనామధేయ ప్రణీతంబైన బసవపురాణసారంబను మహాపుణ్య కథలయందు ప్రథమాశ్వాసము.

బసవపురాణసారము

ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీవిభూతిలలాటక
గ్రీవకరుద్రాక్షమాలకీలితవక్షా
కోవిదబసవనహిమనగ
రీ వర్మ వికాస పాల్కురికి సోమేశా ! -1

ఆవె॥ ఆవధరింపుమిట్లు భవదీయ హాణితమౌ
బసవచరితనున్న ప్రమథతతికి
మ్రొక్కి పేరు పేర నొక్కొక్క పద్యంబు
జెప్పి శరణు జేతు చిత్తగించు -2

సీ॥ కొఱతలేకుండ భక్తులకిచ్చె నెవ్వాడు
దానమిచ్చియు పరిధానములను
పునరాయువిడిభూ విభునకిచ్చె నెవ్వాడు
రణములో జంపి వారణభటాళి
అందంబుగా శిరసు నందుంచె నెవ్వాడు
గళము దున్మినను యంగళపు భవికి
అలరత్నములు జంగములకిచ్చె నెవ్వాడు
లవపుటంబులు చెలంగవశగతిని

తే॥ అమిత మహిమను బసవ సహాయుడగుచు
నర్థులకు నెన్నగాను వాఙ్మనసమున
గోచరుండన మణివాలు మాచదేవు
మదినుతింతు దలంతు నమస్కరింతు -3



మ॥ శరణుండొక్కడు పుష్పముల్ గొనుచురాజావీధిలో రాగబల్
కరిగర్జించి మదంబుతోడుతనుదూకన్ చప్పుడాలించి సిం
ధుర కుంభస్థలముల్ హరించి శివభక్తుంబ్రోచు సామర్థ్యుడౌ
యిరవందారి పదారవిందములకు న్నే ప్రొద్దునేమ్రొక్కెదన్ -4

శా॥ శృంగారంపు విరీవనంబు జెరిచే సింధూరముల్ గూల్చియా
తంగాయుష్యమొసంగిరాశి జొన్నల్ స్థాణుంబ్రతిష్ఠించి యున్
లింగంబున్ బలికించి యున్నబసవన్నంబుల మన్నంభుజిం
పంగా జేనె నటంచు మ్రొక్కెదను నే బావూరు బ్రహ్మయ్యకున్ -5

సీ॥ నిటలాక్షుడయ్యును త్కట రౌద్రమునను దే
వతల చేతను నమస్కృతులు గొనుట
కలశభవుండు దాసుభవవనధియు
తరగజేసియు పునర్వాసమిడుట
నరసింహమూర్తి భీకరరూపు మాన్పిభూ
వరమర్త్యులకు భయంకరత నుంట
తప్పకప్పుడు దేవతల చేత పనిగొని
తనర గాంగేయాభిధాను దగుట

తే॥ రుద్రుడవునీవ దైవమాత్రుండవీవ
భద్రుడవునీవ శరవణ భవుడవనుచు
వాసికెక్కిన శంకర దాసమయ్య
పాదవనజంబులకు మ్రొక్కి ప్రస్తుతింతు -6

చ॥ మదన విరోధివచ్చి నరమాంసము గోరినసూనుదేహమున్
విదళనజేసివండియు నివేదన జేసిన పుత్రహీనమౌ
సదనములోన భోజనముసల్పునటన్న శివాజ్ఞజేసి పు
త్రుదలచినంత జేరుచిరు తొండనికేనునమస్కరించెదన్ -7

మ॥ శరణార్థంబుగ జేయు భక్ష్యములు భ్రష్టాదింటివంచున్ సుతున్
శిరభగ్నంబొనరించి దాచి శివుకున్ శ్రీయాలుకున్ నవ్యపా
కరుచుల్ నిడ్డ సుతున్ని దెమ్మనగ భక్త ద్రోహి వాదొద్దనన్
వరపుత్రున్నిడ మ్రొక్కజేయు నిమ్మవ్వంగొల్తునే బంటునై -8

మ॥ విరులీశార్థము బెట్టరాణిసుమతావిన్ మూర్కొనన్ ముక్కు పూ
జెరి గోయంగను నోరిమూఢకొనముంజేయుండ ముక్కేమిజే
సెరయంచున్ సతిదున్ని తృప్తిపడు శ్రీశంభుకృపాత్రుడా
నరసింగానయనారిగారి పద సన్నాళీకముల్ మ్రొక్కెదన్ -9

ఉ॥ వంచనలేక నీదు గణవర్గము కంచును దండు బోవగా
చంచలనేత్రువీడకను క్షామములో తన బంధులెల్ల రా
వించియు నీడగాదినిప్రవేశమునై సతిబంధుకోట్ల బీ
డించగ శూలి మెచ్చిన నరేంద్రుని చోడమహేశుగొల్చెదన్ -10



సీ॥ సింగమ్ముపైరాగ సాగిలి మొక్కియెం
దుండి వచ్చితి రననురగ భూపు
డనియె నిమ్మవ్వసాకెను నడికెజొగయ్య
చెన్నకంబలిబోసి చీరగొనియు
సిరియాలుడొకమారిసరివారికిని బహి
ష్కారమనగ వణకంగ దెలిసి
భవ్వాని చెంగళవ్వను దోడ్క పురుషదీ
నమ్ము వేడదను భిక్షమ్మొసంగు
హలాయుధు జరిస్తవము
పట్టణతో మ్రొక్కుచుందు తత్పాదములకు -11

మ॥ జడయారాత్మజుడై హిమలూరిచార్జించియున్ వేయిడా
పడిహొన్నల్గొనబోయి పరమనాచిడామణింగ్గైకొని వి
నిడితద్విత్తమువెయ్యి శర్వయని సైన్యంబందుతాకుమ్మిదన్
మృడు బల్కించిన నంబిగొల్చెదను సామీయంచు నాచెయ్యితోన్ -12

సీ॥ ..........
తనమందిరంబుల నపహసింప
తనకు చముశ్రీపర్వతంబు గోకర్ణకా
శీపుష్కరంబుల చెలువమెన్న
తనసజ్జ పరుషవేదిని కల్పకద్రుమ
చింతామణులనెల్ల సిగ్గుబుచ్చ
............
...............

తే॥ హర్నిశంబీశునుస్కిశివార్పణంబు
శంకరోక్తి సహస్ర నిష్కప్రదంబు
నంబి శ్రీపరమనాంచిదేవాంబగారి
చరణయుగళంబులకు ప్రదక్షణము జేతు -13

సీ॥ మాసశివరాత్రినేమంబు వాల్మీకేశు
నర్చింపగా ఒడయనంబి భక్తు
లకును నమస్కృతులాచరింపగ నిల్వ
జూచిసంకల్పించి శూలిసహిత
ఇరువుర వెలిసేయ నీర్భంబు వదలిన
శక్తిప్రభావంబు జాటుకొనుచు
కళియలు గగ్గలు కళియారియణుమూర్తి
హరిపాలు చేదిరాజయ్య బంటు

తే॥ దినము వెయిశివపూజలు దీర్పప్రొద్దు
బోయియేకార్యములు జేయబొందకున్న
వేయికరములు బడసి గౌరీశునర్చ
నాసహస్రంబుజేయు బాగా ఖ్యుదలతు -15

కం॥ వెట్టికి తట్టలు బంపిన
తట్టలు మోపించి వేగ తత్పక్షికిదా
తట్టలు తృప్తిగ మోసిన
పిట్టవ్వకు శరణుజేతు ప్రియము జనింపన్ -16



చ॥ అడపముగొంచునంబి చెలియాగృహసీమకు నిత్యనిత్యశం
భుడు జనగాంచి తద్భరముపుచ్చక పొమ్మని లేచి తత్పురీ
చెడుగు శరణ్యుకాకఠినచిత్తుల ద్రుంచెదనంచురాగయా
మృదుకృపగాంచెనంచు ప్రణమిల్లెదనే కలికామనాయికిన్ -17

ఉ॥ సింధుర చర్మ భూషునకు చెల్వపు చందనముల్ త్రికాల వే
ళం ధరియించు నేమమున నంతట నుండగ నొక్కనాడు శ్రీ
గంధములేక మొచెయి సుగంధము దీసి యలందలందిశ్రీ
కంధరు చేతగైకొను సుఖప్రదుడాయణు మూర్తిగొల్చెదన్ -18

తే॥ నిత్యవెయిదీపములు బెట్టు నేమమొక్క
దినముతైలంబు లేక సందేహ మంది
తనశిఖారతి వెలిగించి తారకాద్రి
నాథుకృపగన్న కదమలనంబిగొలుతు -19

ఉ॥ శ్రీమహాదేవునర్చనము సేయత్రికాలములందు నొక్క పూ
టా మహీపాక్షి చాలదని డస్సియు పందెముగట్టి తిర్పరం
ధామ నృపాలులింగము ముదంబున నిల్పియభీష్టమందు స
న్నాముడు గగ్గలుంకళియనారికి మ్రొక్కెద వాంఛదీరగన్ -20

మ॥ శివునర్చించుచు మూడు వేళలందున్ క్షీరాన్నముల్ నిచ్ఛిద్ర
వ్రవిహీనుండయి కూలిజేసి గడపన్ యావృత్తి లేక య్యెడన్
దివసోపాసములుండి యొక్క నెడగూలెన్ మెగ్గితానున్ శివా
ధవయంచున్ తెగజూచి శంభు గనుదాతంగొల్తు హర్పాలునిన్ -21

తరలం॥
తొలుత మీనము శంభునకు బోఁద్రోలి తక్కినలబ్ధి భ
క్తులకునీయగ నొక్కనాడును కృత్తివాను ఋషంబు యా
వలను జిక్కగ వీడసారెకు వచ్చినంబ్రణమిల్లి దా
పలగిరీసుతనీసుగను అడిభర్తకున్ బ్రణమిల్లెదన్ -22

మ॥ అనిలో శత్రులద్రుంచగా నొకవిరోధాత్ముండు విభూతిలే
పనుడైరాగని మ్రొక్క బోవగను కాపట్యుండు ఖడ్గంబుచే
తనువ్రేయన్ పువుదండగా శివుడు తందర్శించుయేణా దినా
ధుని పాదాంబుజముల్ త్రికాలముల సంతోషంబుగా మ్రొక్కెదన్ -23

ఉ॥ బాహుబలమ్మునన్ పరనృపాలురగొల్వగ మాయజంగమ
వ్యూహ మొనర్చిబంపగ త్రయోదశులేతెర భక్తులంచు సం
దేహము మాని ప్రాంజలిగతిన్ శరణంబనక్రూర ఖడ్గ శ
స్త్రాహతి కోర్చ శంభుగను ధన్యునిగొల్చెద దివ్యవల్లభున్ -24

ఉ॥ అత్యపరాధ శత్రు జనులాననముల్ దెగఁగ్రోసి చూడగా
ప్రత్యయ మొక్కలైంగిక కబంధముగన్గొని తల్లడిల్లితా
సత్యము దప్ప కాత్మశిరసట్టకుబాప శివప్రసాదతన్
నిత్యపదంబు గన్న ఘనునింగొలుతున్ కరయూడ చోడునిన్ -25



సీ॥ మందిరాగత జంగమశ్రేణిపాదోద
కములు సేవించు నీమములు జూచి
పరిపంథియైతన బానిసకొమరుండు
జంగమవేషుడై యంగణముకు
వచ్చినగనినర్ఘ్యపాద్యముల్దెమ్మని
తనసతి బిలువనత్తరుణి జూచి
యయ్యయొ వీడుసిరియకకొడ్కుమల్లండు
పాదముల్గడుగంగ పాడియగునె

ఆ॥ యనుచు చెంబు బారవైవంగ యీశలాం
ఛనుని నిందకోర్వకనుమృగాక్షి
కరయుగంబుదున్మిహరుగన్న కళియంబు
పాదపద్మములకు బ్రణుతి జేతు -26

ఉ॥ జంగమరూపు దాల్చి కరిచాపుడు నోచియటుండ నిమ్మనే
నంగడినేగి వత్తుననియంతట మాయము జేసి వేడ నిం
టంగల వస్తు తత్సమ పటంబుకు జూపిన శూలి పత్రిచే
తంగరుణించు శ్రీయవనితాంబికి సాగిలిమ్రొక్కుచుండెదన్ -27

సీ॥ నడిరేయి జడివాన బడమజ్జనీదరన్
వడకుచు శూలిదావచ్చియున్న
చరణాది శిరమును ధరపయి మోపి మ
ద్దురవేయనుచు నమస్కృతులు జేసి
నిలయాన కలెజూడ పుంసెదునైనవి
త్తులులేక చేపోయి దొరుకకున్న
పదునున్నవెదగొల్చు వెదకి తెచ్చియు వేంచి
మృదువైన శాల్యాన్నము నసుజేసి

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఆ॥ యోపియాకలరసి లేపి యాపుంజల
కోపి తృప్తిగాను మేపి శంభు
తాను గన్నయల యడంగులినయనారు
చరణవనజము లకు శరణు జేతు 28

ఉ॥ లింగవిహీనలైన నరులీక్షణ జేయునటంచు నిష్ఠ నుం
డంగ మహేశ్వరుండు కపటంబున కర్షకుడయ్యు వచ్చితా
చెంగట నిల్వ నుగ్రుడయి శేషవిభూషుని దీక్షజేసి లి
గాంగిని జేయు ధాత్రి పశిభామని హేగణపాలు గొల్చెదన్ -29

సీ॥ కనుగొనతిరునీలకంఠుని గుడికేగి
రాగనొకాంగనరయ్యేపూజ
నడచిన చల్లననాగభూషాయన
వినిమ్రొక్కి జాతీశుమనములొసగ
గాంచి యాతనిభార్య కలుషించితిరునీల
కంఠుని యాననంగలియ గూడ
దగజరాయుక్తుడై దనరశంభుడు బోలె
భక్తుడై పెట్టిదాపెట్టిమాయ

తే॥ జేసితన్ దున్మయెరుగము సిద్ధమనిన
బాసజేయుదుయనజాలవాసనమున
గ్రుంకి యవ్వనరూపులౌ గురుకులాల
గుండయాఖ్యుని పాదముల్ గొనిభజింతు -30

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ మారారి చేతవేళకు
తోరపునేత్రములువడసి దుస్తర వ్యాఘ్రా
కారమున విరులుగొని శివు
చేరుకొనె నటంచుగొల్తు చిరుభూలయరున్ -31

కం॥ నరపాలనత్వమొల్లక
పరమార్థము గనియునిష్ఠ పరుడయ్యునుశం
కరుకరుణాంబుధి దెలిసిన
తిరుపాలుని చరణములు నుతింతును భక్తిన్ -32

చ॥ వెలయగ కర్మదాయమున విక్రమచోడ నరేశుడీశ్వరుం
నిలిపిన తానుగాంచి ఘననిష్ఠ పరుండయి శూలిపైడికో
వెలను బ్రతిష్ఠజేసిబలు విస్మయమంద వెలుంగునట్టి పూ
సలనయ నారి పాదయుగ సారసముల్ మదిలో భజించెదన్ -33

కం॥ తిరునావకరీ శాతకి
కరుణను హేమావతీశుగనుగొని సద్యో
వరములు చేకొని వెలసిన
తిరుకురుపి పదాబ్జములు నుతింతున్ వేడ్కన్ -34

తే॥ రోహిణియు దానుగౌరీశ్వరుని మహోత్స
వంబులోగొల్చి కామ్యార్థ వస్తులెల్ల
బడిసి భూరుద్ర వితతికి భక్తిజేయు
చున్న తిరుమూల దేవుని సన్నుతింతు -35

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ ఉడురాజధరుని సత్కృప
బడసియు నొకమాడగొంచు ప్రతిదినమందున్
ఒడయులకు నీప్సితాన్నము
లిడిన చిరుంతొండపదము లేభజియింతున్ -36

ఉ॥ లంజెయుగొట్టెనీశుని స్థలంబున నేడ్చిన ద్రోహినిన్ శిరో
భంజన జేయనంత జనపాలుడు తత్తపరాధ సాక్షిగా
రంజగదేకవీరత్రిపురాంతక జెప్పుమటన్నగోత్రది
క్కుంజరముల్ వడంక బలుకున్ వినుకిన్నర బ్రహ్మగొల్చెదన్ -37

సీ॥ అయ్యహొన్నులు కిన్నరయ్య నర్థించంగ
బోయ్యెదనని తడగియ్యమున బ
లుక కూలిగాని వద్దికి బోదురే యని
నొకగుంటువేయ స్వర్నికము గాగ
పడుకొమ్మనగ మూటిడు మోసుకొనిపోవు
బడుగు జంగము జూచి పనిచి బసవ
కిన్నర బ్రహ్మయ్య సన్నుతింపుచు రాగ
మన్నుముట్టగనయ్యో వెన్న పసిడి

తే॥ మూటలును బంచికొమ్మని చాటుభక్తి
పాదుకొల్పియు జడపరావాదియంబు
జాతసారంగుడాకల కేతబ్రహ్మ
పాదములు మ్రొక్కిగందునాహ్లాదమునను -38

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఉ॥ తాళునె దారవిక్రయపదార్థము జంగమ తృప్తికంచు నా
వేళ గృహంబు కేగ బసవేశుడు హొన్నులు బెట్టిరాగ తా
హేళనజేసి కట్టెలను హోమమొనర్చియు భక్తిజేయునా
మోళిగ మారయా చరణముల్భజయించెద నిష్ట సిద్ధికిన్ -39

సీ॥ ఏవేళిడుదు జంగమావళికన్నంబు
అన్నంబు బెట్టుంచగారములును
యేధర్మిభూపాలు సౌధంబు ఛేదించు
ఛేదించును కరండ జాలములను
ఏశీలగ్రోలు మహేంశాంఘ్రి పాదంబు
పాదంబుసోకిన భర్మమగును
ఏకర్తగను చరానీకావిశేషంబు
శేషంబుగొనుచు హర్షించి మించు

తే॥ నట్టిసద్భక్త మాహేశ్వరాగ్రగణ్య
చెన్నబసవన్నచే బసవన్నచేత
ప్రస్తుతందిన కన్నడ బ్రహ్మయకున
మోయనుచునే ద్రికాలముల్ మ్రొక్కుచుండు -40

శా॥ ద్యూతం బాడియునోటు వడ్డకపటోద్యుక్తా భవుల్ గట్టితే
మాతద్విత్తమటంచు పిల్వగను సన్మాహేశ్వరుండైన న
య్యోతండ్రీ ! యపరాధినైతినన శర్వుం డిచ్చు కావ్యార్థముల్
ప్రీతింగైకొనునట్టి మూర్ఖనయనారిం దల్చినే మ్రొక్కెదన్ -41

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

మ॥ ఇసుమున్ లింగముజేసి కావడులపాలీ శాభిషేకంబుగా
నుసమర్పింపగ తండ్రి యోర్వకనిశానుంగాలద్రొబ్బంగ హే
యసమాక్షా ! యనిదల్చి పితృగనిసంహారంబుగా వించిన
ట్టి సుతుండని మ్రొక్కుచండెదను చండీశాహ్వయున్ సారెకున్ -42

మ॥ విషముష్టీఫలముల్ భుజింతమనగా వీక్షించి మాధుర్య స
ద్రసముల్ జేసియు జంగమ మండలికి నానందంబుగా నీడి
పసనందీశునిగొల్చు జంగములస త్ప్రాణాత్ములన్ జేయు న
ద్యసమాంగుండగు ముష్టిచౌడయ పదద్వందబులే మ్రొక్కెదన్ -43

కం॥ పరిపూర్ణమైన యేరును
యిరువాయలు జేసియున్ మహేశ్వరులుందా
చరి మార్గుడైన పదములు
మరువకనే దలతును మదిసుమసనాయాఖ్యున్ -44

కం॥ మానపాత్రెక్కకీశుని
యానసుమీ యనగనీదు నాగకవర్మా
యానప్రసాదిదాసని
యానను చేపట్టుమనుచు నభినుతిజేతున్ -45

కం॥ అభవుని శరణులతాజ్ఞా
విభయంపడకనునె దిర్చిచేగండూష
ప్రభుగొన్న ప్రమథవర్యుని
యభినుతిజేయుదును సాగరాపోశనునిన్ -46



ఉ॥ నెయ్యమెలర్పభావమున నిష్ఠపరుండయి పూజజేసియున్
తియ్యని షడ్రసాన్నము యుధేచ్ఛముగాగను కల్లుజేసి యం
దియ్యగ చేతగొంచుగిరిజేశు భుజింపగజేయు సూర్యచౌ
దయ్యపదాబ్జరేణునుదురంటగ మ్రొక్కి కృతార్థునయ్యెదన్ -47

సీ॥ శివుడు మచ్చుం తృప్తి జేతువే యనివేడ
భిన్నాహమును జేసి ప్రియముతోడ
మున్నూట నర్వదిపుట్లను నుంగొౌడ
బియ్యంబుగాగను పిష్ఠగూడ
సూపశాకంబులు సాపాటికినిజూడ
మిరియాలు చారులీ కరణిగూడ
పక్వాన్నములుదధిపయఘృతంబులు నీడ
భుజియించి బాపురేపుడమిరేడు

తే॥ గన పసిడి వానతద్దేశమునను వాడ
వాడదప్పకగురిపించి వరములిడ్డ
మేలుగాగను శ్రీకరికాల చోడ
రాయనికి మ్రొక్కుచుందు గా రవముతోడ -48

శా॥ తా భోంచేయురుచాన్నముల్ మిగులస్వాదంబుండగాదక్షవా
టీంభీమేశునకిచ్చి రమ్మని వధూటిన్ వెంబడింబంప జూ
చీభర్మా హరివాణమందుకొని తచ్చేషంబు భుక్తించి మే
జ్యాభీష్టంబిడగొన్నవీర చొడదివ్యాంఘ్రిద్వయంబెంచెదన్ -49

ఉత్సాహం॥
చద్దియంబలింకగ్రోలుశంకరుండునాకటన్
వద్దజేరి పొత్తులోన వశ్యుడయ్యు చోడనీ
సుద్దిజెప్పుకొంచుద్రావ చోద్యమంచు చెన్నయన్
తద్దయున్ నుతించిగొల్తు తత్పదద్వయంబులున్ -50

పంచచామరం॥
మృగంబులేదునిత్యదృంచిమేలమైన తారకా
నగంబుకంపి జంగ మార్చనంబు సల్పుచుండగా
జగంబులెల్ల విస్మయంబు జెందగాను శూలివేం
యగంబుగన్న తెల్గు బొమ్మయందలంచి మ్రొక్కెదన్ -51

శా॥ స్థాణుం గూర్చితపంబు శ్రీనగమున్ సల్పంగ గంధర్వులా
ప్రాణింగుగుండెలుబంచు బల్కినను శాపంబిచ్చి శిష్యుండుక
ల్యాణ ప్రాంతమునన్ మృగంబులయి జొమ్మయ్యస్త్రశస్త్రాహతిన్
నాణెంజాననాలకించిన శివానందున్ ప్రశంసించెదన్ -52

సీ॥ నిత్యత్రి కాలంబునియమ లింగార్చన
సలుపుచు బసవేశుసముఖమునకు
రాగనీశుని మందిరము నొక్కజైనుండు
చెప్పగాలను జొర ఛీదురాత్మ
వెడలిపొమ్మనవాడు వెక్కిరించియు నీవు
భక్తుడైతెను జూపు ప్రత్యయంబు
ననగగోలింగ భట్టారకు మహాకాళు
మొదట నరికి సామ్యములను జెప్పి



తే॥ జైన చూడు మటంచు మస్తకముద్రుంచు
కొనియునేడు దినంబులకును శిరంబు
ఘనతగానిల్పు కొన్నయేకాంతరాము
తండ్రి పాదరజంబులునా తలను దాల్తు -53

కం॥ శ్రీకంఠుని యర్చన కా
త్మాకంఠాబ్జంబు బూన్చి తన్మస్తకమున్
లోకమెరుంగ ధరించుమ
హాకాళుని సన్నుతింతు హర్షము దోపన్ -54

తే॥ శంకరుని బూన్చునట్టి మస్తమును దాను
పిడపగొన్నట్లి మహాకాళు దెలియు మనియు
గొంతు శివుబూన్చి మున్నాళ్లు కొత్త శిరము
గొన్నగోవింద భట్టారకునిని గొలుతు -55

సీ॥ నియమాభిసేకగో సమయము జంగమ
ర్థించంగ నొకకొడ్కు ధేనువుకును
శూలి కర్పింప సకలములను మాలూర
దళముగావలెనన్న స్థాణువుకును
గోవింద భట్టారకుని హసించి శిరంబు
తరిగిన మరిమరి దండముకును
మెలచిన శిరుసులు దులిచిన వెల్లగీ
లించగ నమ్మహా లింగమునకు

తే॥ క్షీరములు బిదుక్క నిచ్చియు శ్రీదళములో
సంగినవ్వేశిరాళి పల్కంగ జేసి
వన్నెకెక్కిన మొరటద వంక యాంఘ్రి
పాంసు ధరియింతు మచ్చిరోత్తంసమనుచు -56

మ॥ పురనాభిం ఘనశూలి గెర్లనను దైవోపాస కమ్మోని శం
కరునర్చింపగ జైనులొక్కటనిసారంగంబుగన్ వైవయా
మరునాడగ్నిని బాదులందిడిన క్షేమం బొప్ప వర్ధిల్లునా
తిరునావుక్కర శ్రీపదంబులను భక్తిన్ మ్రొక్కిసేవించెదన్ -57

ఉ॥ కన్నులు లేక శంభు జలకంబుకు ముంగిట బావిద్రవ్వగా
జిన్నుల సహ్యతన్ దెగడి చేదిడు సూత్రము ద్రెంచి వేయ నో
పన్నగ భూషయంచు జనభ్రష్ఠుల కన్నులు బోశపించి వి
ద్వన్నుత నేత్ర దాయి రవదాండి పదాబ్జము లేను మ్రొక్కెదన్ -58

సీ॥ కాశీపురంబున కార్తికేయాంశంబు
నను శివద్విజునింట జననమంది
పర్వతాత్మజస్తన్య పానంబు జేసియు
త్తుంగ చోడన్నిలింగాంగి జేసి
జైనకృతకవహ్ని జల్లార్చి పాండ్యభూ
భర్తకు సుస్వరూపంబు నిల్చి
పంచాక్షరీమంత్ర పటము దృష్టము జూపి
మృత బాలకుని జీవమిచ్చి యన్య



తే॥ మతమడంచియు శైవ ధర్మంబు దెలిపి
భక్తులను జేసికనియంబ పదిని మస్త
వారిజములిచ్చు పిళ్లనైనారి పాద
ధూళి నుదురంటనే మ్రొక్కుదును ముదమున -59

తే॥ పిళ్లనయనారి శిష్యుడై బేసికంటి
భక్తుడై జైనవితతి దర్పంబడంచి
నడచి సఖి వాకిటపి తాళ్ల నాటివారి
బడయు నుత్తుంగ చోడని పదములెంతు -60

మ॥ హరునిం గొల్వని పాతకావలిని దగ్ధాంగంబులం జేయు భీ
కరమౌ కొట్టు లొనర్పజైనులు యనంగ ధ్వంసి పూజించికొం
దరు వర్తించిన బ్రోచి కొందరిని తాతంజేయు నాశ్రీకుల
చ్చిరియారిన్ నుతియించి తత్పదములే చిత్తంబులోనుంచెదన్ -61

కం॥ మనసిజ హరుగొల్వని జిన
మునులందరి జూడగొట్టుపులకాల్వను శా
సనముల్ జేసిన నిడుమా
రనరేంద్రుని పాదములు శిరంబున్ దాల్తున్ -62

మ॥ ప్రమథుండయ్యిన పిళ్లనైననారిన్ ప్రార్థించి పూజించి గూ
నిమెయింజక్కనగా వరంబుగొని బల్ నిందాత్ములౌజైనమొ
త్తము గర్వంబడగించి లోకముల వార్తల్‌జేయు సౌందర్యపాం
డ్యమహీశున్నుతి యించి మ్రొక్కెదను నెయ్యంబొప్పగా నామదిన్ -63

శా॥ భూతేశార్చనలందు దీవియలు పొందం బెట్టగా జైన సం
ఘాతంబొప్పక నేయిలేమి జేయంగా లింగస్నానాంబువుల్
చేతశ్శుద్ధిగనిద్ద జ్యోతులు ప్రకాశింపంగ శంభుండు స
ప్రీతిన్ మెచ్చి వరంబులిచ్చునవనందిన్ దల్చినేమ్రొక్కెదన్ -64

తే॥ శంకరున కభిషేకంబు చందనాక్ష
తములు దాధూప మిడియుచు ఘృతము లేక
నీరములు బోసి దీపంబు నిలుపు వరద
సోమయను గొల్చి మ్రొక్కెదనామనమున -65

శా॥ రాలేపూవులుగా ధరించెదను మారాజానమోయంచు త్రై
కాలంబున్ నవయశ్శముల్ నిడగదాగావల్కి పోరాకఘ
స్త్రాలైదయ్యనేమసంఖ్యతోడన్ నీదల్చినే మ్రొక్కెదన్
.......... -66

ఉ॥ పట్టిన కోలదీసికొని పర్చిక మాడెడు గానిగట్ల రా
పట్టికి ముద్దుతమ్ముడను బావవునీవని వావివర్సతో
తిట్టిన నవ్వి గుడ్డి మరదీయని కన్నులు శంభుడిచ్చెన
పట్టున యంబెనాఖ్యపదపంకజ ధూళితలంధరించెదన్ -67



సీ॥ వనజాక్షి గూడి జీవన జాంబకుని కేళి
వనిధిదేలంగ తద్వార వనిత
మాతావిటకతీర్థ మాతంగరూపజా
మాతానికాయ ధర్మములు గోధ
నములాదిగాలుంతనము జేసి యుల్లంఘ
నమబెట్టి శివభవనంబుజేరి
కాంతనబ్బుకరమా కాంతాస్త్రు సన్నిధి
కాంతాకచప్రియ కంజగంధి

తే॥ యుక్తపారంగనిభకంధరోక్తి బొగడి
మానినీమాత చిల్కని మానరోహ
నాస్త్రుడై శూలిగనుల హస్తంబు గనుల
పాడినుతియింతు నన్నుగా పాడి బ్రోవ -68

శా॥ క్రూరుల్ జైనులు వాదమాడుచును దుష్కృత్యంబులుంబూనియిం
పారన్ ద్రుష్టము జూపుమంచువుటమున్ భస్మంబుగా చేయ వృ
క్షోరాజంబున జీవిజేసి ఫలపుష్పాశాఖలుం జేయు కో
పూరిబ్రహ్మయకేను మ్రొక్కెదను సమ్మోదస్త మానంబులున్ -69

సీ॥ వతిజైన బౌద్ధబోధితుడైన గురుదాస
మయ్యచే కర్తంబు జెయ్య నింపి
విశ్వంభరితుడు చండికేశ్వరుడని చీమ
లోబలికించెను లోకమెఱుగ
జైన కైతవ ఘట సర్పంబు కరమున
బట్టిలింగముజేసి భాసురముగ
జిన్నాలయంబులు భిన్నంబుగాజేసి
పతికి లింగము గట్టి భక్తుజేసి

తే॥ ఉత్తరేశుని పొట్ల చెర్వున ప్రతిష్ఠ
జేయుదేవర దాసయ్య శిష్యురాలు
వారిజములిచ్చు పిళ్లనైనారి పాద
ధూళి నుదురంటనెమ్రొక్కుదును ముదమున -70

తే॥ పిళ్లనైనారి భక్తుడై బేసి కంటి
భక్తుడై జైన వితతి దర్పం బడంచి
తేజమున మను సంగళదేవి చరణ
కమల యుగళంబునకు నమస్కారమిడుదు -71

సీ॥ మృదునర్చనలును మానుడిగెలోపలను జె
యగజైన నికరంబు వెగటు దోచి
పురము వెళ్లనిల్లింపనిబ్బరముతో వెడలిసం
గరమొనర్పగ భయంకరముదోప
బలయుక్తుదేతేర శిలప్రతిష్ఠించి జై
నులు యనుపసికి బెబ్బులుల కరణి
తాకి బౌద్ధులను చీకాకు పర్చియును చా
ర్వాకనీచాత్ముల మూకలార్చి

తే॥ ధూర్తమున జైనులనియెటి వార్త మాన్పి
పదియునేనూర్లువసతులు శిథిల పరచి
క్రమముతోనన్ని భర్గాలయములొనర్చు
హిరియ నాచయ్య గారికే శరణు జేతు -72



శా॥ ముప్పూటన్ శివుగొల్వ నక్షికయిరంబుత్పాతమై యుండిక
న్నెప్పం దెర్వకయున్న జైనులును గౌరీనాథుడేడంచు బల్
తప్పం జెప్పియు జిన్నునొద్దనిలుపంతా సమ్మరంగాలి మా
చెప్పున్నే వరమిచ్చు హుళ్లరసిరి సోమ ప్రభుం గొల్చెదన్ -73

మ॥ తమ జాతీశున కంచు జేసిన పదార్థం బొక్క జగంబు తృ
ప్తముగానీడినవాథుడాదిగను క్రోధంబొప్పగా ముష్టి ఘా
తములున్ జేసిన తాడనంబులును బౌద్ధశ్రేణికిందాకలిం
గము గర్భంబున జొచ్చునట్టి వైజక్కవ్వాంఘ్రులే మ్రొక్కెదన్ -74

చ॥ పతిశివభక్తిపినుడయి భర్జనజేయు శివాలయంబులో
శితగళువెన్నదిక్కున వసింపగ తత్పతి కొంగు బట్టి మూ
ర్ఖత గను నీద్వనేమలకు రమ్మనితానపుడుంగిరీటిస
ద్గతిపురుషత్వ మందు తిలకవ్వకు నేను నమస్కరించెదన్ -75

సీ॥ అలగావంగ నొకయ్య మార్గంబున
బోవంగ మీరెందు బోదురనగ
జాతరమల్లికార్జున దేవునందరి
దరిశనార్థము వెంట నరిగిచూచి
మెడకప్పు కనువిప్పు జడకొప్పు సురతలే
దనిహసించియు జంగమయ్యనడుగ
అలచట్టు పలగొట్టు కొనిపట్టుబడినవా
త్సల్యుడై శూలి సాక్షాత్కరించి

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

తే॥ కొమ్ము వరమన్న నా వెంట రమ్మటంచు
లేపుకొనివచ్చి సొన్నాల కాపురమున
సిద్ధమల్లేశుడని నిల్ప సిద్ధరామ
మమ్ముగాపాడు మనుచు నమస్కరింతు -77

ఉ॥ భిక్షుకుడన్యదైవముల పేరు దలంచ శిరంబు ద్రుంచగా
ను క్షమ వల్లభుండు తననుంభవితోసరిజంపబంప తా
నుక్షహయాలయంబున శివో యనగా మది మెచ్చి శూలితా
దృక్షము జేర్చు శ్రీహరి యమాహ్వయుపాదయుగంబు గొల్చెదన్ -78

కం॥ శ్రీకంఠుని గొల్వని కా
కీకుల ధ్వని విననటంచు గీల్కొని ఘంటన్
తాకర్ణంబుల నిడుఘం
టాకర్ణుని పదములే యెదం దలతు మదిన్ -79

ఉ॥ అంగమునందు లింగమనయంబు ధరించని వారిముట్టనం
చుంగడపంగ స్వప్నమున క్షుద్రుడు ముట్టిన గాసి జెందిశ్రీ
శృంగముకేగి పావక వశీకృతుడైన గిరీశు దృష్టన
ష్టింగను వీరశంకరుని సేవయొనర్చి నమస్కరించెదన్ -80

ఉ॥ దండిపురాణ శాస్త్రములు తార్కికులోడి యదృష్టమిట్లు జూ
పుండన విష్ణు విగ్రహమునుం దరలించుక పోయి శూలికిన్
దండము బెట్టిపించు ప్రమధాగ్రిణి మాశివలెంకమంచనా
పండిత దేవు పాదమృదు పంకజముల్ శిరసావహించెదన్ -81

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

మ॥ శివనామాపతికంచు పుష్పములు గోసీతేగ సేమంతి జా
తి విరచ్చేబడగా శివార్పితమనన్ దేవాంగనాయుక్తలిం
విధాయార్చనుడైహో హోరిరాద్వక్షంబుశూలాహతిం
దవులంజేసి మహేశు గన్గొనిన శ్వేతాయంచునే గొల్చెదన్ -82

ఉ॥ పెంచినవ్యాఘ్రభీతికిని భూరుహ మెక్కియు శ్రీదళలబులన్
ద్రెంచిని డంగ శంభుని పయింబడుటన్ శివరాత్రి చేత చె
ల్లించ శివుండు కోర్కెలు ఫలింపగనిచ్చిన మోదితాత్ముడా
చెంచునకేను వందనము జేయుచు నుందు మనః ప్రపూర్తిగన్ -83

సీ॥ సీతరోగమున శుష్కించి తాను పసిండి
కోక దాలుపువేడుకొనుగ చంది
తెలుపునాచే బోదుతీవ్రంబుగా చండి
కేశుపూజింపుమీ వింత నుండి
యని చెప్పగాను పిళ్ళారి కుడ్ముల తిండి
కానియబ్బని కఱకంఠు దుష్ట
తంత్రమ వీడి స్వాంతమున తానును వంద
నంబు ముదిత ప్రమేయంబు నామ

తే॥ యంబనగ పండితోత్తము లవని మెచ్చ
గాను మధురోక్తులందు నఖండ నుతుల
ఖండితస్తుతియును నిరోగస్తు దండి
కవివరుని దల్తు నే శుభకరమునుండి -84

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

సీ॥ సూర్యుచే బోని కృష్ణగిరీశు గొల్చియా
రోగ్యుడునగు మయూరు నిహసించి
కేలుదమ్ములు దీసి శూల మూనియు హస్త
వనజముల్ క్రమ్మర ధనదాత్మునకు దెరి
యించి ప్రార్థించి సర్వేశు చేత
కన్నులరాశి నిక్కంబుగా బడసి జా
త్యంధ దుర్మాంస పుష్టాకులాది
.................................

తే॥ నాగనేత్ర చిత్తరోగుల బిలిపించి
నయన యుగములిచ్చి జయముగాంచి
ఘనత కెక్కినట్టి కాళిదాసకవీంద్రు
దలతునెప్పుడు నేను ముదంబుతోడ -85

కం॥ షోడశగణముల యందలి
గూడిన సద్భక్తి సలుపగోరియునుదురా
ట్బూడా మణి పదములగొని
యాడిన హోన్నయ్య పదములభినుతి జేతున్ -86

కం॥ గిరిధన్వి భక్తుడయ్యును
వరములుగైకొని యునాత్మ వాంఛితమొదవన్
సరసుడగుపాండ్యనాయని
చరణాబ్జ యుగంబుకేను శరణనియందున్ -87

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ బిడ్డనుచు శివునకుకొం
గొడ్డియు నీప్సితము వడసియున్నత సుఖియౌ
గుడ్డవ్వపాద జగముకు
నడ్డుపడుచు మ్రొక్కుచుందు నతివినయమున్ -88

కం॥ సుబ్రమణ్యాజనకపం
చబ్రహ్మాత్వత్యయన నిజముతోడుతనా
దబ్రహ్మామరయు కిన్నర
యబ్రహ్మయ్యకును మ్రొక్కి యభినుతిజేతున్ -89

కం॥ సేతునకు వరములిచ్చిన
భూతేశుని గొలచి యిష్ట భోగంబుల సం
ప్రీతుండయ్యనగోడయ
కేతయ్య పదాబ్జములను కీర్తింతు మదిన్ -90

కం॥ సారంబైనది శైవా
చారము వర్తించి భక్త జనమందిరమం
దారుండయ్యిన పుణ్యుడు
బీరయ్యకు మొక్కుచుందు ప్రియము జనింపన్ -91

కం॥ ఖండశశిధరుని పూజలు
నిండుమనంబునను జేసి నిష్ఠపరుండా
హండయ్యదారి పదకర
దండయుగంబులకు నేను దండమొనర్తున్ -92

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ సజ్జన మును పూజించియు
హృజ్జన్మారాతి గని సహిత పదయశుడా
బిజ్జలదేవయ పదములు
మజ్జనముంజేసి నేన మస్కృతి జేతున్ -93

కం॥ నాగ దనుజవైరిని పు
న్నాగ విరుల పూజజేసి నంగడుప్రీతిన్
నాగవిభూషణుగను ఘో
నాగయ్యకు మ్రొక్కుచుందు నాగరికమునన్ -94

కం॥ త్యాగము జేసియు తాశివ
యోగమనుష్టించి కాంతి యుజ్వల కళలన్
శ్రీగణుని జాచుషోడశ
నాగయ్యకు జేతు వందనంబులు భక్తిన్ -95

కం॥ హేళి శశి వహ్నిలోచన
వ్యాళాభరణా యటంచు వందనములని
వ్వాళు లొసంగియు హరుగను
కాళవ్వకు జేయుచుందు కైమోడ్పులునే -96

కం॥ మృదుభక్తిరసము మనసున
సదలంగా నీక భక్తి సహిత యశుండా
పడిహారిని సోమయాఖ్యుని
యడుగులకు నమస్కరింతు సతివినయమునన్ -97



కం॥ నిక్కపు మానసుడైతా
ముక్కంటి భజించియును సమున్నత యశుడా
చిక్కలకె నాగయాంధ్రుల
మ్రొక్కుచు నుండెదను నేను మోదము తోడన్ -98

కం॥ భావజరిపు పాదంబుల
సేవ యొనర్చియును మోక్ష సిద్ధుండగునా
దేవర బాచయ పాదం
దీవరముల మ్రొక్కి సన్ను తింతును వేడ్కన్ -99

కం॥ వాచిక మానస కాయిక
సూచనములు నొక్కటయ్యి సోమార్థధరున్
జూచియు పూజించె విరుల
బాచయ్య పదారవింద భజన మొనర్తున్ -100

కం॥ మేచకకంఠు భజించి స
దా చారముతోను శూలి యంతఃకరణన్
దాచరియించిన షోడశ
బాచలదేవీ పదములు ప్రార్థింతుమదిన్ -101

**అంబురుహ వృత్తాలు**

1. తేరశ భక్తులు గూడి చరించి నుతించి శూలి కృపాార సా
వారదిదేలి చరాంధ్రుల పూజలు వైభవంబుగ జేసియున్
క్షీర ఘృతాది పదార్థము నీదిన సింగదేవుని పాదపం
కేరుహ యుగ్మముకే శరణంబు నిరంతరమ్మొనరించెదన్ -102

2. కౌతుక మొప్పధరాతలియందు సకాలమీశు భజించియున్
జాతికురంటక చంపక మాలతి జూజులాదిసుమంబులున్
భాతిధరించి వరంబులు గైకొను బ్రాహ్మి భట్టి పదాంబుసం
జాతవిశాలసువేశల యుగ్మము చాలగన్స్తుతియించెదన్ -103

3. నిక్కపు భక్తియొనర్చుచు శంకర నీవునాకికదైవముల్
ఎక్కడ నిశ్చయ మందగ నభ్రముకేశుడు ధనమాయచే
చక్కగ వచ్చియు చక్రధరాయని శర్వుమొత్తగ రౌద్రసా
తృక్క పదాంబుజయుగ్మము లెప్పుడు సన్నుతించి భజించెదన్ -104

4. హటక భూధర చాపు గుతించి యుహర్నిశంబుదలంచగా
ఘోటకవేంద్రుడు తానెదురుంజని కోరుమంచు వరంబులన్
చాటియు యిష్టపదార్థము గైకొను సంఘమైగిళి పాదకృ
పీటరుపహంబుల మానక నిత్యము ప్రేమమున భజించెదన్ -105

5. భూతి శివాక్ష గురూచరలింగము పుణ్యతీర్థప్రసాదమం
త్రాతిశయార సువర్ణములందు సదాభిలాషిత విత్తమై
క్ష్మాతల భృత్తన యేశుని గన్గొను సంగవాంబనిజాంఘ్రి కం
జాతయుగంబుకునే శరణార్థులు చాలగానొనరించెదన్ -106

6. శ్రీవరబాణుని చిత్తములోన వశింప జేసిన కాలమం
దూనిన చందనతంబులసూనను దీప ధూప నివేద్యముల్
తావిడియంబు లొసంగియు దిన్నకృతాంజలిచ్చిన పుణ్యుడౌ
దేవరసూవద యుగ్మము లేను భజించి మ్రొక్కుచునుండెదన్ -107



7. శంభుసదాశివశూలిమహేశ్వర ! సంకర్షణ నమోనమో
జంభసురారి పదార్చిత శూలిగజాసురారి నమోయనీ
కంభవపద్మములను దయార్చకు కన్న సాంఖ్యపదాంఘ్రులే
నుంభజియించి సదా హృదయంబున మోదమొప్పగను మ్రొక్కెదన్ -108

8. బాలశశాంక ధరార్చనగోరి ప్రభాత కాలములందు న
శీలముతో శరణావళి గూడి విచిత్ర పూజలొనర్చియా
బాలకు పూర్ణదయంగను శ్రీపదిహారి బసవనీపాదకమ
లాలను యుగ్మము లెప్పుడు నేకుశలంబుతోడను మ్రొక్కెదన్ -109

9. దవ్వుల నేగియ ప్రసూన వితాన వ్రాతంబు భక్తుల కిచ్చియున్
అవ్విధి తాను శివార్చన జేసి మహావినోదమనస్కుడై గూర్పదు
నవ్వులగూర్ప మహేశుని చేత సప్రసాదముగొన్న శ్రీ
పువ్వుల బాచిన పదాబ్జము లెప్పుడు ప్రొద్దుప్రొద్దున మ్రొక్కెదన్ -109

10. యానయనారడి భర్తదముంజనయారి సుందరనంబిపిళ్ళన
యానరి కాళవగారు హోళంబరుండుళీ మారయారి
గానముఖంబున పాడి శివార్చనగడి శూలిదయామృతంబు
చీనదెనయా పాదమృదాబ్జముల్ మదినీశుకింమ్రొక్కెదన్ -110

11. దేహజవైరికి తాను దయార్చన దీర్చ జంగమభక్త దా
సోహమొనర్చు యశోభరితుండై శూలి చేతయభీష్టమున్
ల్మాహవరంబులు చేకొని శైవపదంబు దెల్పిన తీరునన్
యోహిళదేవుని పాదసరోరుహ యుగ్మమేను నుతించెదన్ -111

12. తొండనికింజిరుతొండని సాంఖియ తొండనెన్నను సంగమా
చండనికిన్ మిరుమిండని యోహిళసర్గలాంబికకుమ్మర
గుండయనీకతియఖండ నిరర్గళ కోర్కెలిచ్చిన శంభుడీ
తండని మ్రొక్కిన బొబ్బిలిదేవి పదంబు నేను భజించెదన్ -112

13. రాకసుధాకరశారదతార మరాళహార సటీరమం
దాకినిహార సుశ్శారద శారద సుధాపయోన్మిషనైభూజ
త్యాకుముదాంగు శివును దయంబు నుతించి యర్చనలిచ్చి శ్రే
యాకరమందిన గామాలదేవి దయాంఘ్రి పద్మము నెంచెదన్ -113

తే॥ 14. షోడశుల తెలుగుల నామసూచకంబు
గణసహస్రంబుతో నుండెగాన తత్ప
దములు కందాంబు జాతవృత్తముల బూన్చి
ఆఖ్యములు సన్నుతించితి నవధరింపు -114

శా॥ సారోద్ధారవిచారవీరశైవా చారశ్రియాలోలదై
వారశ్రీగురులింగజంగమ పదద్వయందప్రపంకేరుహా
కారుణ్యాంగ సుచిత్తఖేన చార్వక వ్రాత జీమూతవి
స్తార స్పర్శనరూప భృంగిరిటి గోత్రాదీనరక్షారుణీ -115

కం॥ సవనారి భక్తయితిహా
సవచన హృత్కంజప్రసవపూజకశ్రోవా
సవప్రముఖగమ్యలీలా
సవనిజకృత భోగ బసవ శ్రీపాదయుగా -116



హంసయానవృత్తం
విప్రభోగితార్కికప్రవీణయుక్తయోరుగం
టిప్రతాపరుద్ర ధారుణీపతీ సభాంతరం
గప్రయోగ భస్మరాజపద విహంగ నాయకా
సుప్రభావ పాలకురికి సోమనాథపాహిమాం -117

గద్య : ఇది శ్రీమద్గురు లింగజంగమ ప్రసాద లబ్ధగణపవరోల్లసభవనాశ
పూరీవాస భక్తమాహేశ్వర పాదపంకేరుహ భృంగవీరసంగనామ
ధేయ ప్రణీతంబైన బసవపురాణ సారంబను మహాకథలయందు
ద్వితీయాశ్వాసము -118

శ్రీబసవపురాణ సారము

తృతీయాశ్వాసము

కం॥ శ్రీశివపూజవిదేహమ
హాశీలధురీణ కారణాంగసలింగా
దే శిక పదవాసనిత గి
రీశ విగత పాశపాల్కురికి సోమేశా -1

తే॥ అవధరింపుమిట్లు భవదీయ చరితమా
బసవ చరిత్రయన్న ప్రమథ తతికి
మ్రొక్కి పేరు పేర నొక్కొక్కపద్యంబు
జెప్పి శరణుజేతు చిత్తగింపు -2

సీ॥ ప్రతిసోమవారంబు శితికంఠునకు నేత్ర
పద్మముల్ బూన్చుచు బడసి భక్త
వరుమోలగూడియు వర్తింపగా ద్విజుల్
వెగటునోచియు ధరావిభునకవిరి
మనపట్నమంత దుర్మార్గంబులను హెచ్చి
భక్తుల మంచును బసవ మంత్రి
వర్ణసంకరులచే వర్తించుచున్నావా
డనబిలిపించి వర్ణాధములతోను

తే॥ గూడియుందురె మన రాజుతోడననియె
అధముడునుగాడు ప్రత్యక్షమమృతదేహు
డనుచు బిదుకంగ దుగ్ధము లంగుళముల
గరముశివనాగుమయ్య కేశరణు జేతు -3

కం॥ నిక్కపు భక్తియు బ్రబలుట
కక్కసపడి ద్విజులు తర్క మాడగశ్రుతులన్
కుక్కలతో జదివించిన
అక్కఱతో కల్లదేవ యాంఘ్రి నిగొలుతున్ -4

ఉ॥ విప్రులతో సమంబె పృధివీరథ చిహ్నులటంచు నుగ్రకో
వప్రభవించి బల్క శివభక్తుని పొందుక త్రానులోన నుం
చిప్రతి బాప లెక్కగను చెప్పుసమానము దూగనట్టి సా
క్షిప్రజకెల్ల దెల్పు శివ చిత్తున కేను నమస్కరించెదన్ -5



సీ॥ శివభక్తతతిభుక్త శేషంబుగొనితెచ్చి
యనురక్తితోడుత నారగింప
నదిబాపలతికోప మగ్గలింపగ జూచి
మదినోపకిదియు బ్రాహ్మణవిధంబె
పురినుండ వలదండ బొమ్మన్న తత్ప్రసా
దముఖభాండమొకింత తరిమి చల్ల
బలుమంటలై మంటపము లిండ్లుగాల బూ
డిదపెంటలైనయా పదలకోడి

తే॥ అపుడు జనమేయుడిచ్చిన యగ్రహార
మిపుడు వినియవచ్చునటేను కృపనొసంగు
మనుచు ప్రార్థించ పురమెప్పటట్లుజేయు
బిబ్బబాచయ పదములభిస్తుతింతు -6

ఉ॥ శైవమతస్థుడయ్యు నిజస్నానజలంబుల రొంపిలోన భూ
దేవుడు కుష్టరోగమున ధేనువు నెక్కుచు వచ్చిపడ్డ త
త్పావనపంక మౌషధము బాపని రోగము మాన్పినట్టి ధ
ర్మావహు భక్తియుక్తుడగు మాదర చూడయగారిగొల్చెదన్ -7

మ॥ కడుకుష్టవ్యధనొంది విప్ర వరులుంకాశీ జలస్నానముల్
గడువన్ లెస్సగునంచురాగ తనజాలే రాంబువున్ ద్రొక్కనా
యదునం జూచియు మళ్లిపొర్లి గతరోగాకారు డావీరికా
మృదుడీ బాణసజము భక్తజన సత్ప్రేమన్ ప్రశంసించెదన్ -8

ఉ॥ మీదుగసామవేదియుగమింపభవీయని వంటకుండపై
పాదుకమూయజూచి కులపంతమునన్ భువిమీద వ్రాలియున్
పాదములంబడంగ శివభక్తునిగా గురుదీక్షలిచ్చితా
నాదరమొప్ప జేయుశ్వపచయ్య పదంబులనేదలంచెదన్ -9

మ॥ ఘటభోగంబు దొలంగి నీశు గలువం కాష్టంబుసేయంగ యా
వటవృక్షంబుననేడునూర్లభూతవ్రాతంబు తద్ధామ సం
ఘట సత్యంబున తారకాద్రి జేరంగాబోవగన్నట్టియు
ర్భటదేవయ్య పదాబ్జరేణువును మత్ఫాలంబునందాల్చెదన్ -10

కం॥ ఉద్భటుని పాదసేవయు
సద్భక్తులు మెచ్చజేసి శరణావలి న
త్యద్భుత మొప్పగ హైమా
వద్భర్తను గన్నబొమ్మవను దలతుమదిన్ -11

ఉ॥ జిల్లన భూతమేద్చుచు వచించినరీతిగశల్య కాష్టముల్
సల్లలితంబు జేయు వటసాలము నెక్కి సబద్ధుడైనతా
తెల్లని జేజకొండకరుదెంచిన యుద్భట శిష్యుడైన యా
తల్లికి భోజరాజుపదపద్మములెప్పుడు నాశ్రయించెదన్ -12

ఉ॥ కుష్ఠశరీరివై యెదురు గూడదు రాగ యటంచు విప్రులు
త్కృష్టముగా వచింపకడు దీనుడు నొచు పురాష్టసోమసా
కష్టము బాపుమంచు జనగా దయచేసియు నంటనిల్పక
ర్మిష్ఠుల వ్యాధినొందగ శపించిన గుండనగారి గొల్చెదన్ -13



సీ॥ నిష్ఠజూపగ పరమేష్ఠి శిరోహర్త
మృతధేనుదెచ్చినారతిప్రియమున
పాకంబు జేసి నాకాకటి కిమ్మన్న
యోగాకయని వేగమట్లు సేయ
గనుజూచి విప్రులు కినిసియుందుండకు
మని వెళ్లగొట్టిన జనగ వెంట
పురినున్న దేవప్రకరమెల్ల నేగిన
భయమంది ద్విజులెల్ల బారిభక్తి

తే॥ సల్పమగుడించుకొని రాగ వేల్పుగములు
నొకటి గుడిలోన నిలిచెనొండొకటి యిపుడు
ఇట్టి సాదృశ్యములు తననెఱుగ జూపు
నట్టి కెంబావి భోగయ్య నభినుతింతు -14

ఆ.వె॥ భక్త నిందవినని బాసగావున శివు
శరణు జేసి నింద సలుపగాదు
తెంపుజేసెశివుని కింపైన హిమ్మయ్య
సంగయను దలంతు సంతసమున -15

కం॥ కడుమోదంబుల శరణులు
యెడదీనత్వంబు జంగమార్చన లెపుడున్
విడువక చేసియు భవుగను
బడవర బ్రహ్మయ్యపాదప్రణుతియొనర్తున్ -16

ఆ.వె.॥లింగవరవ శత్వ లీనుడై జంగమ
భక్తిజేసి మోక్ష పదము గన్న
బాచిరాజు పాదపద్మంబులేమని
నుంచికొల్తు కోర్కెలుండుటకును -17

ఆ.వె॥ కంతు హరుభక్తపుంగవు
లెంతవిజృంభించిన నువారికెదురాడని యా
శాంతయ దేవయ పదములు
స్వాంతము నన్నేదలంచి సన్నుతి జేతున్ -18

కం॥ నెమ్మదిలోపల ప్రమథుల
నమ్మికతో జంగమార్చనముజేసియుతా
సమ్మతిగా శంకరుగను
బొమ్మయకును శరణుజేతు శుభకరమొదవన్ -19

తే॥ జడలు గట్టియు భక్తులు చేతకాయి
కమున పక్వాన్నములు జంగమములకిడియు
నీశుగను యుత్తమాంగద కేశు పాద
చరణ యుగళంబులకు మ్రొక్కిసన్నుతింతు -20

కం॥ పాయక భక్తుల బొగడెడు
కాయకమున జంగములకు ఘనముగ తృప్తిన్
జేయుచు నుండియు గిరిజస
హాయుని గను శృంగిబొప్ప యార్యునిగొలుతుర్ -21



కం॥ శరణులకు గోనెలిమ్మన
వరలబ్ధినిజంగములకు వాంఛాన్నంబున్
కరమర్థితోడనీడియు
హరునింగను గోణిమల్ల యార్యునిగిగొలుతున్ -22

మత్తకోకిల

శ్రీగళున్భక్తులకు పువ్వుల చెండులిచ్చియు లబ్దినా
రోగణంబయ్యలకొనర్ప హరుండురిక్త గృహస్థుడై
హొగమివ్వకయున్న చల్లన నభ్రకేశుడు మెచ్చునీ
యోగిదేవుని పాదయుగ్మపయోజముల్ మదినిల్పెదన్ -23

ఆ.వె.॥భవిగిరిశుడయ్యు శివనింద జేయగ
నణచ బోవ జాంగమైన యాత్మ
ఘుతజేసునద్రుగత్పుజమెచ్చుకా
లాగ్ని రుద్రయను దలంతు నెపుడు -24

ఉ॥ అంతర మార్గమయ్యును దిగంబర రూపమునున్నకోక ప్రో
వెంతయు గుట్టిపించి బసవేశుడు మ్రొక్కి సవిత్రయాక్రియా
కంత ధరించు మన్నతనుగప్పి చరస్పృహదాయ యైన యా
బొంతలదేవి పాదయుగ పుష్కర ధూళి తలంధరించెదన్ -25

కం॥ చొంగల కాయకములును స
లింగుల చేకొని చరావళికి నన్నంబుల్
పొంగుచు నీడికపర్థికృ
సంగను ధవళయ్యగారి పదములు గొల్తున్ -26

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఆ.వె.॥ భక్తసేవజేసి పరతెంచుకాయక
మునను జంగమముల దనిపిసాంబ
శంకరున్నిగన్న లెంకబ్రహ్మయ్య ప
దంబులేదలంతు సంబరమున -27

మ॥ భువినే జూడనటంచు వక్రమున శుభ్రంబైన వస్త్రంబు గ
ప్పివసింపన్ పవనార్తినిండొలగనిర్విణ్ణాత్ముడైయున్న హై
మవతీశుండు ప్రసన్నుడైననిజకామ్యంబీయకున్నట్టి యా
శివముద్రయ్య పదారవిందములు నాచిత్తంబులో నుంచెదన్ -28

కం॥ లేమతొ జంగమ భక్తుల
దామంబులకేగి బహువిధార్పితరుచులన్
నేమించినట్టి యుదరద
రామయ్య దలంతు కోర్కెరాకడకు మదిన్ -29

కం॥ ఏ యెడ పంచాక్షరి జప
కా యుండై వాంఛితములు గైకొనె శివుచే
మాయినిదేవయ సత్పథ
తోయజ పంకంబు నానుదుట ధరియింతున్ -30

కం॥ ఖండశశిమౌళిపూజలు
నిండుమనంబుననుసల్పి నిత్యపరుండా
చండీశు చామయాఖ్యుని
రెండడుగులుపూజజేతు రేయింబవలున్ -31

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ ఖండపరశానుచరుడై
తండములగు జైన బౌద్ధ తతియామిని మా
ర్తాండుడన బరుగు పుణ్యుడు
బండయ దేవయ్య పాద పద్మములెంతున్ -32

కం॥ కుండల భూషుని చందన
తండులముల పూజజేసి ధర్మపరుండై
యుండియ శంబును గైకొను
హిండెయ బ్రహ్మయ్య పదము లేనుతియింతున్ -33

తే॥ జంగమార్చనలెప్పుడు సలిపి భక్త
సముదయముజూచి తత్పరిచర్యలందు
వంచనములేక జేసి శర్వాణివిభుని
గన్ననిభబాహుపాదయుగంబుగొల్తు -34

కం॥ నిర్లోభంబునను మహే
శ్వర్లకు నిష్టార్థములు నిజము నిచ్చిన యా
నిర్లజ్జ శాంతయంఘ్రులు
దుర్లభవస్తువులు నానుదుటధరియింతున్ -35

కం॥ హటకగిరి చాపునిమది
నాటించియు జంగమార్చనము జేసెడు యా
కోటీశు సోమయంఘ్రులు
పాటిగపూజింతు మదిని ప్రతిదినమందున్ -36

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఆ.వె.॥జంగమాంఘ్రి తోయజమ్ముల సేవయొ
నర్చివారికర్పణముల నీతి
వన్నెకెక్కుభువిని వర్తించి నట్టిగొ
గ్గవ్వకేను మ్రొక్కెదనుదినమున -37

కం॥ మాసము మాఘచతుర్దశి
వాసరబహుళముల శంభువ్రతనిశ్చలతన్
దాసోహన శివరాత్రిస
దాసంగయ యాంఘ్రులేను దలుతునువేడ్కన్ -38

తే॥ భక్తులకు సరిలేరని బాసజేసి
ప్రత్యయంబులు జూపిరౌప్యాచలేంద్రు
చేతయిష్టార్థములను సుస్థిరతగొన్న
నవకరులకేతయకు వందనములుజేతు -39

కం॥ అమృతాస్యధరునకుం పం
చామృతనభిషేచనం బొనర్పించిన యా
అమృతనేవయ్య సత్పా
దమృత జలముగ్రోలుచుందు ననుదినమందున్ -40

మ॥ అమలంబైనసు కాశీతీర్థభాండం బట్లంచి తానందుజం
గమపాదోదకమేయనంతమగునాధిక్యంబు దృష్టించి లో
కములన్ దెల్పిన కేశిరాజయను వేడ్కన్ దల్చి మున్మారు పా
ధములన్ మ్రొక్కికృతార్థునయ్యెదను హృత్పద్మంబురంజిల్లగన్ -41



కం॥ లపనమున శ్రీషడక్షరి
జపియించుచు పార్వతీశుసత్కృపగనుయా
కపిలేశు వీషణాఖ్యుని
ద్విపదములు మ్రొక్కుచుందు దివరాత్రములన్ -42

తే॥ రేయిబగలును లింగనిరీక్షణంబు
మరువకుండంగ కన్నులు దెఱువరాని
రోగమంది ప్రాణంబులు తాగమింప
ఈశుడేలిన యనిమిషకేశుదల్తు -43

తే॥ తొలి మృగము శూలి జేరబోదోలియన్య
జాగిలము వేయుచుండంగ శర్వు పేర
విడిచినదిరాగ తనగొంతు బొడిచి శివుని
గన్న తెలుగేశు మసణయ్య గారిగొల్తు -44

కం॥ మందగి కాయకమున చెర
తండంబుల పూజజేసి ధనదస్నేహున్
నిందుమనంబున గనుగొను
ముండన్ బ్రహ్మయ్యకేను మ్రొక్కుచు నుందున్ -45

కం॥ పన్నగ భూషణుంకంబొ
త్పన్నంబుల పూజజేసి ప్రతివాసరముల్
మన్ననలంది యశుండౌ
జన్నవిభునిపాదయుగము సేవింతు మదిన్ -46

కం॥ తారక దానవగర్వవి
దారక జనకునకు నీప్సితార్చనలిడు యా
వీరయ నాగయకునమ
స్కారమ్ములు జేయుదును త్రికాలములందున్ -47

లయగ్రాహి
సంగతిగ భేరీమృదంగజేగంట తాళం గతులతోడగురులింగార్చనములు
పొంగుచునుజేయ సంపెంగకలిగణనాధచెంగలువ సూనముల జంగమార్చనల
భంగతో జేసి గణపుంగవులను షడరసాంగార్పితముజేయ మంగళవ్రతుడున్
డింగరిగమల్లయ పదాంగుళములంటు ధూళింగొనియునాడు కన్నుంగవనుదాల్తున్ -48

కం॥ శివపూజ జేయుచుండగ
భవిజైనుడురాగచాటు బట్టిన వాడున్
అవమానోక్తిని బలుకా
హవమున తలద్రుంచు బంకయను నేదలతున్ -49

తే॥ ముత్తియంబులరంగులు చిత్తజారి
పూజవేళయునొకనాడు బుట్టకున్న
జీవమిడువంగ శివుడు సుస్థిరపదంబు
నివ్వగొన్నట్టి మాయణ్ణ నేదలంతు -50

కం॥ తానెప్పటి కయ్యిన యీ
శానుని దూషణము వినని శపధము నందన్
జైనకులమత్తకరిపం
చాననుదావీరకల్లయనునేగొల్తున్ -51



కం॥ శివరాత్రుల యందు మహో
త్సవముల భక్తుల మనోరధములిచ్చి నయా
శివరాత్రి సంకయాంఘ్రులు
దివరాత్రులు గొలుతు వాంఛదీరందలతున్ -52

కం॥ అనిమిషదృష్టుని శంభుని
గనుగొని యాత్మేతరముగ గాంచినవేళన్
దనిసినదని మ్రొక్కుదునే
ననిమిషయాఖ్యునకు వర్ణితా శంభునకున్ -53

కం॥ కుసుమశరారిని మృదుతర
కుసుమంబుల పూజ జేసి కోర్కెలు గనియా
నసమే తు చిక్కయార్ప ద
బిసజములు నుతింతు నాయభీష్టము గాంతున్ -54

కం॥ గణనాధుజనకలాంఛన
గణతతికర్చనలొసంగి గణనతొనారో
గిణులను జేసి వచించిన
గణశిఖికిని శరణుజేతు కడువేడ్కనునే -55

ఉత్సాహం
తుంటవిల్తుగాల్చి నట్టిధూర్జటిన్ విచిత్రగో
రెంట విరులతోడ సద్గరిష్ఠనిష్ఠవెల్తిగా
కుంటగొల్చి యిష్టసిద్ధి కోర్కెలూరగొన్నయా
కంటె కల్ల యాంఘ్రిలేసకలమునేను దల్చెదన్ -56

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

చ॥ శరణుజనాళి గూడియును చంచల నిష్టగరిష్టతోడ శం
కరుని గుణించి యర్చన త్రికాలముడింపగనాచరించిస
ద్గురుచరణాల లాంచనులకున్ సతతేచ్ఛలొసంగినట్టి శ్రీ
గిరిగిట శీనయాంఘ్రులకు కీర్తనలన్ శరణార్థి జేసెదన్ -57

చ॥ శివునకు సాటిలేరు సరసీరుహ జాగరుడధ్వజాశచీ
ధవులని సాదృశంబులు యధావిధిజూపియు జైనభౌతిక
ధ్రువసుతవర్గ జిద్ఘగవరుండనగా విహరించినట్టియా
నవిముగుతయ్యగారి చరణద్వయసేవ యొనర్చుచుండెదన్ -58

కం॥ గురులింగజంగమంబుల
పరిచర్యలు జేయునట్టి ప్రమతుండగునా
ముర్రహరి కేతయ యంఘ్రులు
శిరసాష్టాంగముగ మ్రొక్కి నేసేవింతుమదిన్ -59

తే॥ జంగమంబుల కిష్టార్థసంగ్రహములో
సంగిగణపర్వములనునసంఖ్యజేసి
బసవదండేశు కిన్నర బ్రహ్మమాన
నీయుడగు బడికార మల్లయనుగొల్తు -60

శా॥ ఫాలాక్షార్చనలందు నెప్పుడును సాఫల్యంబుగాగొంచుస
ల్లీలన్ దేశికలింగజంగములు నాళీకంబులన్బూన్చిభ
క్తాళిన్ గూర్చియు భక్షభోజ్యములు తృప్తింబొందగానిచ్చుయా
పోలెబ్రహ్మయ పాదపద్మములు నాయుల్లంబులో నిల్పెదన్ -61

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

కం॥ శూలిన్ మరువక తాష
ట్కాలంబుల పూజజేసి కాంక్షలు గొనియా
బాలబ్రహ్మయ పదప
ద్మాదులకు మ్రొక్కెద మదీప్సితము చేకూరన్ -62

పంచచామరం
సహాయతన్మహేశ భక్తసంతతీవిపద్భయా
నిహారగాఢవాసరామణిస్స్వభావమొప్పగా
విహారుడయ్యె విక్రమ ప్రవీణతన్ వెలుంగునా
మహాబలయ్యగారికే నమస్కరింతు వేడుకన్ -63

కం॥ గిరిధన్వి శరణులకునై
కరితోకోకలునుగట్టి కాయకసిద్ధిన్
గురుచరుల కోర్కెలొసగిన
అరవియ హోల్లయ్యగారి యడుగులు గొలుతున్ -64

తే॥ శివునిదూషణమెవ్వడే జేసెనేని
వాని తలద్రుంతు ననుచు జవంబుమీర
ప్రళయకాలాగ్ని రుద్రుని పగిది మెరసి
యున్నగురుబలబ్రహ్మయున్ సన్నుతింతు -65

తే॥ నిద్రమేల్కొనువేళ భూరుద్రవితతి
పాదతీర్థప్రసాద మెప్పటికి గొనెడు
నేమకుండని మ్రొక్కెద నిత్యమునను
దుమ్మనబ్రహ్మయడుగు కెందమ్ములకును -66

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

సీ॥ శ్రీశైలమునకేగి శివపూజజేసిలిం
గోదకంబుల జల్ల నుర్విలోన
నున్న భక్తులు నభవోయని పల్కులు
రీక్షించి లింగార్థ భిక్షమడుగ
వారలిడియు సోమవారం బుగాకత
క్కినదినంబులు రమ్మటననదేమి
కారణంబనగ శ్రీకంఠాభరణమేము
ధరియించబోవువాసరమనంగ

తే॥ వరుసనర్థించుక్రియయందు వారమేగి
పాదజలశేషములుగొని వారివెంట
రజితగిరికేగి శ్రేయసంప్రాప్తుడైన
శ్రీగిరయ్యకు మ్రొక్కెద సేమమొదవ -67

కం॥ మారాంతకు పదపద్మస
మారాధనజేసి నిత్యమందు వెలయు నా
వీరుడు లింగయ చరణాం
భోరుహములకేను మ్రొక్కి పూజింతు మదిన్ -68

ఆ॥ షోడశోపచార శుభకరార్చనలమ
హేశుపూజజేసి యిప్సితముల
బాగగన్నయట్టి మాదయ పదముల
కేనుమ్రొక్కి దలతు నెపుడు మదిని -69



తేగీ॥ శరణనిందలజేయు దుష్టాత్మకులను
వైరమున భంగమొనరించి వైతుననుచు
కక్షగట్టివెలుంగులోకము లెఱుంగు
మల్లమాహయ్య పాదపద్మముల దలతు -70

తే॥ శూలిభక్తులకిష్టార్థసొమ్ములిచ్చి
ఘనముగాలోకముననను పొగడ్తకెక్కి
వాసిగాసంచరించు యేలేశుబ్రహ్మ
చరణయుగ్మంబు దలచినేశరణుజేతు -71

కం॥ శీలుండయ్యును ఆవుల
పాలను మజ్జనము జేసి ప్రమధేశుకృపన్
చేలిన హాలబ్రహ్మ ప
దాలకు మ్రొక్కెదను వాంఛితము చేకూరన్ -72

కం॥ లింగార్చనలందెప్పుడు
చెంగలవలుదెచ్చి పూన్చి శితకంఠుని భ
క్తింగడు సన్నుతి జేసిన
లింగబ్రహ్మయ్య పదములభినుతి జేతున్ -73

పంచపాది॥
మల్లెమొల్లలు జాజులు పల్లవములు
శ్వపతి యీశాన భీమోగ్ర భవయటంచు
రూఢి మహదేవశర్వరుద్రో యటంచు
నిష్ఠతోడుతగోరి నమాష్టకములు
స్మరణ జేసెడు కవిలెబ్రహ్మయ్య గొలుతు -74

కం॥ అస్ఖలి తుండగు మూర్మితి
రస్కరణతశంభుభక్తి రంజనుడగుశ్రీ
భాస్కర యాహ్వాయువదతే
జస్కకమలములెద దలంతు సంతసమొప్పన్ -75

స్రగ్విణి॥
ప్రేమలూరంగ నర్చించి మృత్యుంజయున్
నేమపూర్వంబుగా నిత్య భక్తాళికిన్
హేమవస్త్రాన్నముల్ నింపుతో నిచ్చుశ్రీ
స్వామి నాధాంఘ్రులే సంతతం నెంచెదన్ -76

చ॥ భవులతొ మాటలాడనని పద్ధతినుండి వనంబులోపలన్
పువులను గోయుచుండ భవుపోలిక నీశుడు చాలునాయనన్
అవునని మళ్లి చూచి దిగులంది శివా యనుచండ గంగ శ్రీ
ధవశరుడున్ ప్రసన్నమగు ధన్యుడు గొగ్గయ కేను మ్రొక్కెదన్ -77

కం॥ శివరాత్రులందు గిరిజా
ధవుశరణులకును సపర్యతాజేసి చరా
నివహెచ్చులొసగిమేనిన
సవరద నాచయ్య చరణ సన్నుతి జేతున్ -78

ఇంద్రవజ్రం॥
మాతంగపటు చర్మదుకూల పాదా
బ్జాతాంతరంగా క్షయవీరశైవా
చేతప్రమొదూర్జిత శీలవర్తీ
కేతయ్య పదాబ్జయుగంబుగొల్తున్ -79



తే॥ మూడు వేళల జంగమ మూర్తులకును
పాదపూజలు గావించి భక్తవితతి
గూడితీర్థప్రసాదంబు గొనుచు నుండి
నగజ పతిగను సంగమ నాథుగొల్తు -80

చ॥ గడియలు దప్పకుండ పురఘుస్మరు పూజలొనర్చి నిత్యమున్
విడువక మూడు సంధ్యలను వేల్పులరేని భజించి నట్టియా
నిదిపనసయ్య పాదముల నిష్ఠగనే ప్రణుతించి యద్గులం
బడి శరణంచుమ్రొక్కెద శుభంబులు చేకురనామనంబులో -81

ఉ॥ సంతతమున్ దలంచి పదసారసమే మది నుంచగోరిన
ర్ణింతు నిషంగ వార్ధికృతనిశ్చలచిత్తుని ముక్తి కన్యకా
భ్రాంతునిజగమభ్రమర భవ్యలతాంతుని దాసభావవి
శ్వాంతుని పుణ్యమాసవయవన్య వసంతుని భాసవంతునిన్ -82

చ॥ గురువులకెప్పుడున్ తనువు కూరిమితోనిడి లింగమూర్తికిన్
స్థిరమగు మానసంబిడియు తీరికజంగమకోటి కెల్లనా
పరిమితద్రవ్యమిచ్చి శశిభాను ధనంజయలోచనున్ నతో
శరణుని వేడు శ్రీగురుడు చౌడయకున్ ప్రణుతార్థి నయ్యెదన్ -83

సీ॥ విధిగ కపాలంబున విధుమౌళిభిక్షంబు
శూలంబు చేహరిశోణధార
బలుమ్రొక్కి కాలునం బరమెత్తు వాదును
దునుకరింజిత్తు వ్యాసుని ప్రశస్త

హస్తంబుదెగిపడునట్టి వార్తనరసి
సంహారు చేత......
నరసింహుచే హిరణ్యాక్షుని ద్రుంచుట
శరధుచేతద్గర్వ పరిహరంబు

తే॥ చెప్పిచెప్పని విద్వాంసు చండివీడి
కర్మడని సాక్షికిని కీటకములబాపి
నట్టి దోహరకక్కయ్య ననుదినంబు
గొలచి తత్పాదములకు మ్రొక్కుదు మనమున -84

సీ॥ నులకయమ్మియు జంగములకు మృష్టాన్నముల్
గుడిపించి మొదిమెలు గోయుచుండ
లింగమూర్తి దొలంగి లీలతొజలములో
బడగ జూచియు మోపు నిడకపోవ
చెల్లుగాగను విడ్చి శిబిరంబుకు జనంగ
యనఘ కాలాతీతమయ్యె ననగ
మంబులకనిపోవ మడివాలు మాచయ్య
గారితో వెడలు లిగంబు జెప్పి

తే॥ నతడు బ్రతిమాలినను పల్కులాలకించి
ముదము నిత్యంబు తనలింగమూర్తిచేత
దెచ్చియమ్మన లబ్దంబు నిచ్చునట్లు
జేసి తరియించు చంద్రయ్య సేవజేతు -85



## దండకం

శ్రీనందినాధుండు లోకోప్రకారంబుగా భక్తి వర్థిల్ల గాజూతు వానీశ్వరాజ్ఞాను సారంబు సారంబుగన్ మర్త్యలోకంబునన్ బాగెవాటీపురిన్ మాదమాంబోధి రాకా శశాంకుండనన్ జన్మముంబొందియున్ బస్వనామప్రభుండంతకల్యాణ పట్నంబునన్ బిజ్జలాధీశుసామంతుడై సత్య ధర్మంబులచే భూమి పాలింపుచో సద్గురు ద్యాన లింగార్చనాజంగమశ్రేణి దాసోహముల్ నిత్యమున్ లక్షయున్ తొంబదార్వేలు భూరుద్రులున్ నిత్య సంతృప్తులైయుండి సాపంక్తిలో నిష్టమృష్టాన్నముల్ నీడగా దొంగలున్ వంగకాయల్ మెడందాల్చి యేతేరగా జూచి వార్తాకముల్ యిష్టలింగబులన్ జేసి చోరాళినిన్ వీరమహేశ్వరానిష్ఠులన్ జేయ నొక్కయ్య భూమీశు ద్రవ్యంబు నర్థించగా నిచ్చుచో కైతముంజెప్ప నాలించి ధాత్రీశుడున్ లెక్కదెమ్మన్న విశ్వాసమున్ వెల్తిగాకుండ భాండారమున్ యెప్పటట్లుండ జూపించి నొక్కయ్య తా స్వార్థముంగోరి నీభార్యపై చీర దెమ్మన్న విడ్పించగా నక్షయంబైన చేలంబులైనన్ సమర్పించియుందోలగా సంగమేశుండు దాజంగమబయ్యు ఫాలాక్షముంగోరి యాచించగా దర్పణంబావలోకించు మోదేవయంచెప్పగా సంతసంబంది చూడన్ లలాటంబు కన్నున్న చోద్యం బటంచున్ బ్రహర్షించి దీపింపగా నొక్క నాడాపురిన్ గొల్లకాళవ్వ పాలమ్ముచున్ రాగ కాల్జారగా నందినాధాయటన్నన్ సభాస్థానమందుండి నత్యద్భుతంబొప్ప చేపట్టి నిల్పంగ నారాజ మంత్రీ భటశ్రేణి సేనాధిపుల్ జూచి యాశ్చర్యులై దీర్ఘ దండప్రణామంబులన్ జేసి కట్నంబులున్ కానుకల్నీయగా గొంచు మడ్వాలు మాచయ్య కొట్టారు బాచయ్య ఏకాంత రామయ్య యాచార భీమయ్య నిజలింగ చిక్కయ్య దోహార కక్కయ్య శివనాగమయ్యాఖ్యుడున్ కొండగుడి కేశిరాజయ్యయున్ మోళ్గ మాచయ్య కల్కేత బ్రహ్మయ్య శ్రీచెన్నబస్వయ్యయున్ ముస్టి చౌడయ్యయున్ కిన్నర బ్రహ్మయున్ కన్నడ బ్రహ్మయున్ నాదిగాగల్గు సద్భక్త మహేశ్వరాకీర్ణమునూడి శైవప్రతాపంబులున్ పృధ్విజేయున్

పవాడంబులున్ గొల్చుచున్నంతలో బిజ్జలోర్వీశునాస్థానముల్ జేరగా బోయలున్ తండమున్ గూడియేతెంచి విజ్ఞాపనం బాలకింపో మహారాజ ! రాజాజగచ్చక్షు తేజామహిన్ మాకుశూలి ప్రసాదంబునన్ చంద్రభాగంబు శ్రీశైల సౌరాష్ట్రగోకర్ణ కాశీగయా కంభఘోణా ప్రయాగాదులంబదెప్పుడు న్నివ్వగా గొంచు మా పుత్ర మిత్రా కళత్రాది సంరక్షణోపాయముల్ గడ్పుచుండంగనీ పట్టణంబందు నీశానుశేషంబు మాకీక బస్వప్రధానాదిగా గల్గు భక్తాగ్రణుల్ వీరశైవంబంటంచున్ మమ్ముమర్పించి యశ్రాంతమున్ తామే భుజింపుచున్నారు యీ నిర్ణయం బొప్పుగా జెప్పి మా వృత్తియున్ మాకు నిప్పించెదో లేక నిచ్చోట మేమందరం ప్రాణముల్ విడ్తుమోయన్న నక్రోధుడై బస్వదండాధిపున్ బిల్వ నంపిచినన్ రాగ హే మంత్రివర్యా మహామేరు ధైర్యాకపర్థిప్రసాదంబు లీశార్థమున్ మాదిమాకివ్వరంచిక్కడన్ చెప్పుచున్నారు లోకప్రకారంబు మీరివ్వరాదా యటన్నన్ స్వయంభాద్యన్యులే దేవతామార్గసం స్థాపనా జ్యోతినిం బూని లింగౌఘు నిర్మాల్యముల్ భక్తి జేయంగ నీలుబ్దకుల్ ఆర్లులుంగార్మనుష్య ప్రతిష్టంబుగా లింగశేషంబుతో చండభాగంబుకున్ పాత్రులైనారు కాకన్ మరిన్ యిష్ట లింగార్పితంబైన శేషంబుతో దుర్మతుల్ ముట్ట సామర్థ్యులేయన్నయా చెంచులామాటకున్ ఉత్తరంబిచ్చిరీమీ ప్రసాదంబు మాభక్తికిన్ వచ్చెనా మంచిదే కాక సాధ్యంబుగాకున్న యేనాటికైనన్ మిమున్ వేడమంచొక్క ప్రశ్నంబుదాబల్కినన్ పట్టెడన్నంబు గొమ్మంచు వేయంగ వారంత చేపట్టు కుందామటంచున్ వడిన్ చేతులంజూచగా ఘోర శేషహిచందంబునన్దోప పూత్కారమున్జేయగా ధూమమింతంతయై అంబరధ్వాంతమున్ క్రొంబోరిగల్ నిండన్చ్చట చ్చట చ్చట ధ్వానముల్ పిక్కటిల్లంగ సాంగంబులై విస్ఫులింగంబులున్ వెల్లి ప్రజ్వాలున్ నిండజాజ్వల్యమాన ప్రభూతంబులైనీయకుప్పంబులై యెప్పిబల్ నిప్పులైరాలుచున్నాది శేషోద్భవంబైన క్ష్వేళంబ మర్త్యాది వీరంబు వెన్నంటగా పారిపోవంగ



వెంటెంటనంటే వ్యథల్ జెందకంఠరంబునన్ గద్గదాకారులంజేయుచో తొంటి చందంబునన్ మింటికిన్ నేలకున్ యేకమైనట్లు పెన్మంటలైమండగా చంద్రసూర్యాది నానాగ్రహంబుల్ వడిన్కంపమొందంగ భీతిల్లుచున్ నీలకంఠాయటంచున్ స్తవంబుల్ వెసంజేయ శక్రాదిదిక్పాలకుల్ మున్నటే యేమిఈక్ష్వాళనోత్పాతముల్ దల్చి శీఘ్రంబుగా నోసితగ్రీవపాహినమోయంచు స్తోత్రంబులుంజేయుచుండన్ విధాతాదికాకోలవేమున్ ముఖం బెల్లభగంబునొందించెనంచున్ భయగ్రస్తుడై కాలకూటాశనాకావవేయంచు ఘోషించగా కేశవుండావలోకించి పూర్వంబు హాలాహలంజేరదీయంగ భర్మద్యుతుల్ మాపి యత్యుష్ణ జ్వాలాహతిన్ మేచకంబౌటనుంజేసి కృష్ణాభిధానంబు లోకంబులో శాశ్వతంబయ్యెనంచున్ దిగుల్జెంది మాపాహిశ్రీకంధరాయా నమస్తే యటంచున్ మొరల్ జేయనాలించి భూతేశ్వరుండాత్మకంఠస్థమాక్ష్వేళముప్పొంగె నేవెూయటంచున్ కరాగ్రంబునంబూని చూడంగ నున్నంతలో మర్త్యలోకంబులో బస్వదండేశు శేషప్రతాపాగ్నిగా దెల్సి యాశ్చర్యతందేవితో దెల్పగా నచ్చటన్ శాంబకౌఘంబు భూమీశునామాత్యరాహుత్తులున్ చూపరుల్ మూర్ఛలుజెంది పాహీ వృషేంద్ర ! గణాంభోజచంద్రా కృపాదృష్టి సాంద్రా యటంచీగతిన్ ధ్యానముంజేయగా దేరినన్ లేచి సాష్టాంగముల్జేసి బస్వ ప్రతాప స్వయంనందిరూపా ! భవద్వర్ణనల్ జేయగా వాసుకీబ్రహ్మకైనన్ వశంబౌనే సదా పోషణోపాయముల్ జేసి రక్షింతువే మాసహస్రాపరాధంబులున్ సైచి ఈ ఘోరక్ష్వేళోపశామంబునంజేయగా చూడ కీర్త్యాది సర్వంబుశ్రీ నందినాథా ! మహాకాళులందాల్చియున్ రుద్రరూపాగణాలం బ్రకాశించ సంఖ్యాతప్రమధాభిధానజ్జులున్ పేర్వెట్టి పిల్వంగనేఅమృతముల్ ద్రావగావచ్చినన్ భక్త మాహేశ్వరానీకమధ్యంబునందొక్క అరోణమందుండగా మాదిరాజయ్యయున్ సిద్ధరామయ్యయున్ మాచిదేవాఖ్యుడున్ భక్తచూడామణుల్ గూడిలోకంబులుంజూడగా కాలకూటంబులున్ హస్తవర్షంబులుం జేసినంతన్

సుధామాధురంబైన మహేశ్వరాస్తోమమున్నారగించన్ చవుల్‌గోరి తెమ్మంచు దామున్ భుజించంగ నాసందడిన్‌జేయకోసంగమేశాఖ్యుడా చిందకుండంగ గొల్చిట్టి దేవయ్య త్రిపురారి విచ్చేసి కూర్చుండు మో బొమ్మయా కాలకంఠయ్యకున్ చాలదింకింతదే చాలునా నీకునీరాళదేవయ్య యింతన్‌శ్రమంబేలా విరూపాక్ష దేవయ్య ఈగంటిడేచాలు యోగయ్యకుంచాలదా తెత్తునే శంకరా పట్టుమో ఫాలనేత్రయ్య ఈ తేపగొమ్మీ పురాతయ్యచింతేలసేయంగ నొప్పున్ శివయ్యా జగద్దేవ మిగులున్న దేనవ్వులన్ బోడుగానయ్యబల్ కొంకకన్ కొమ్ము వేగొమ్ము శివలెంకమంచీయకన్ పాడియే వల్వనన్ పర్వతయ్యన్ యనన్ మివుల నీకుండ వడ్డింపు గురవయ్యకున్ విన్నదేమండ చెయ్యారగా గూరుచున్నాడదో పట్టమూర్తి తగన్ తృప్తియే ధూర్జటీ సంభ్రపడుమయ్య సర్వజ్ఞమాదేవసంతోషమే చంద్రభూషామరిందెత్తునా నిర్మలాయ్యాఖ్య సోమేశ కెంబావి భోగయ్య వడ్డింతునేదొడ్డ లింగేశ్వరా కల్లనాధయ్య కొట్టూరు బాచయ్యకున్ మిండసంగయ్యకున్ తెమ్మటంచున్ ననున్ బిల్వుమోబల్లి దేవావెసంగ్రోలు కల్యాణ దేవయ్య ముదనూరుసంగయ్య రంతేలనేశ్రీవిరయ్యాయనన్ దుగ్గళవ్వాంబయున్ సద్యోజాతవ్వ గొగ్గవ్వ మహాదేవి గుండవ్వ అమ్మవ్వ సకలవ్వ నిమ్మవ్వ శాంతవ్వ బ్రహ్మవ్వ కాళవ్వ కేతవ్వయున్‌గాలమలాదేవియా హైచలాదేవియున్ షోడశం బస్వమా నోమలవ్వకపత్యంబు నానంద దేవమ్మ చిక్కవ్వ రామవ్వ హోలవ్వ కమలవ్వ నల్లవ్వ మల్లవ్వ శ్రీహేచలాదేవియున్ కేతలాంబన్ త్రిపురాంబయున్ అన్మిషద్యాది గాచాల భక్తాగ్రగణ్యుల్ మరింకుక్షులుబ్బంగ లింగార్పణం జేయు సంఘంబులం వారి పాదారవిందంబులున్ ధ్యానముంజేసి వేర్వేరనే మ్రొక్కి సేవించెదన్ చిత్తమందు న్నమస్తే నమస్తే నమస్తే న్నమః

తే॥ మృడునకెప్పుడు కర్పూర వినియమిచ్చు
నేమముందుగ నొకనాడు లేమి గాగ
ప్రాణమిడువంగ చేపట్టి భర్గుడపుడు
ఆదరించు మహాదేవి నేదలంతు -87



కం॥ పన్నగ ధరునకు నెఱ్ఱని
గన్నేరులపూజసేయగా నొక్కటినే
కున్నను కుందగనీశ్వరు
మన్ననలను జెందు నల్ల మవ్వనుగొల్తున్ -88

తే॥ ఎఱ్ఱ చేమంతి పూలు సర్వేశ్వరునకు
నీడుచుండంగ నవియోనగూడకున్న
కన్ను దీసియు కుంకుమగలిపిలింగ
దేవునకు బూన్చు హైచల దేవిగొల్తు -89

ఉ॥ కౌతుకమొప్ప శంభునకు కావిదుకూలమొసంగునేమమీ
రీతి వశింపుచుండ నొకరేయిని వస్త్రము లేకపోయినన్
బ్రాతిక చర్మముల్ వొలిచి పావడమంచు ధరించి శూలిసం
ప్రీతి వరంబుగన్గొనిన దేవిని గొల్చెద కేతమాంబకున్ -90

కం॥ లింగమునకు పాయసము
ప్పొంగుచునీడంగ నొక్క పూట నెతియలే
కంగళవళించగాధవ
ళాంగుడు చేపట్టు దుగ్గళవ్వను గొల్తున్ -91

తే॥ శరణసతులకు సత్కథల్ చదివి చెప్పి
పాయసాన్నము లిట్లు జంగములకెల్ల
నీడగా వచ్చి మెచ్చియునీలకంఠు
డాదరించుపురాతరెబ్బవ్వగొలుతు -92

ఉ॥ దర్పణదృష్టి జూపెడు వ్రతంబుగ నుండగ నొక్కనాడు తా
మర్పున జూపకున్న నియమంబు నిమిత్తము గొంతుదీసి కం
దర్ప విదారుకాత్మముఖ దర్పణమివ్వగ మెచ్చికోరికల్
దర్పశివుండు బ్రోచియు నుతించగ గామలదేవి గొల్చెదన్ -93

సీ॥ తనదూరాచార వర్తన బసవేశుండు
వినిబిలిపించియు కనలి వీర
శైవమర్మము దెల్పి శరణుజాయేలేశు
కేతయ్య కధనుజెప్పగ తదేక
చిత్తుడై మ్రొక్కినీ చెప్పినపనివిందు
నని బిజ్జలుడు కొన్ని దినములకును
కఠినుడై క్రొవ్వి భక్త ద్రోహములజేయ
నపుడుతద్ద్రోహి సంహరమొనర్ప

తే॥ వలయు ననగాజ్ఞ గొని బసవన్నచేత
విడియమునగొని సాహసవీరశైవ
ధీనుడైయున్న శ్రీజగదేవునంఘ్రి
పాదపద్మంబు లెపుడునేప్రస్తుతింతు -94

సీ॥ లింగధారణ ధేనులంగొని భవిజనుల్
పోయిన తృణములు మేయకున్న
తస్కరుల్ వాని సత్యవ్రతంబులకునా
శ్చర్యులై విడిచిన సదనములకు
రాగ చన్నాలకు లేగలురాకున్న
భవులచే కసువులర్పణముజేయ
లేదనురీతి దర్లిమహేశ్వరాళికి
మొక్కిన సంతోషముననుగొనియు



తే॥ క్షీరములతోడ లింగాభిషేకములను
జేసి కాల్చిన విత్తులు చేతవిత్తి
యిమ్మడిగ పంటగొన్న యేలేశుకేత
యాంఘ్రి కంజంబులే మొక్కెదను దినంబు -95

మ॥ సెనగల్ విత్తగ యాత్రజంగములు సేనల్రాగ బంచంగవి
త్తనముల్ జాలకరిత్త గొల్బునదుపన్ తద్భూమిలో సస్యవ
వర్ధనమై పండిన ధాన్యరాసులను చోద్యంబెన్న లోకంబుకె
ల్లను మావారికి కమ్మరైన యెలహూళ బ్రహ్మకే మ్రొక్కెదన్ - 96

ఉ॥ రాణిప్రసూతి యౌనవసరంబున బాలుని లింగమూర్తి తత్
ప్రాణి ధరించనంతటన బాలయుగంబు జనింప జేష్ఠుడా
వాని వసింపజేసి కడవానిని లింగవిహీనుడంచు కా
రీనత బారవైవ శివుడేలిన సౌదర నాచి గొల్చెదన్ -97

ఉ॥ మానక వీరశైవమహిమంబులు గాంచియు జాతిభేదమిం
తేని దలంపకాత్మ బసవేశ్వరకిన్నరబ్రహ్మముఖ్య భ
క్తాను మతిన్ వసించి హరళయ్యతో వియ్యములంది శంభపూ
జానిని వర్తియైన మధువయ్య పదాబ్జము లేదలంచెదన్ -98

సీ॥ పురములో వర్ణసంకము జేసితిరి వి
స్తరముగా ననుచు నిష్ఠురము తోడ
ఖలుడు చార్వాక సంకులుడు దుష్కీర్తిగా
శలుడుదుర్మార్గ బిజ్జలుడు లోచ
నములు దీయించ మొత్తములు నైభక్తసం
ఘములు భూపతికి శాపములు బెట్టి
చలపు భక్తులతొనిచ్చల'పూజ'ఈశుని తలపు
తోడు తన కూడల పురంబు

తే॥ సంగమేశుని సన్నిధి జనగ నచట
శీలుడై యొప్పు శ్రీమడివాలు మాచ
ధీరు దివ్యంగతమనేత్ర వారిజములు
బడసి శివుజేరుహరళయ్య పదములెంతు -99

మ॥ శరణ ద్రోహము జేసినట్టి బౌద్ధాచారుండునే బిజ్జతో
త్వరనా ఛాత్రులద్రుంతు మంచు జగదేవున్ శౌర్య నింగూడిత
త్వరి వారంబులతోడ సంహరము లొప్పంజేయు శ్రీమల్లబ్ర
హ్మరజొయుక్తు పదద్వయంబుల ధరింతున్ మల్లలాటంబునన్ -100

ఉ॥ వేడుక మర్త్యలోకమున నూర్జితకీర్తివెలుంగ భక్తులున్
గూడి మహేశ్వరావళికి కోరినద్రవ్యములిచ్చి వచ్చునీ
యీడెవరంచు మెచ్చి బసవేశుని గర్భములోనగొన్న శ్రీ
కూడలి సంగమేశ్వరునకున్ బ్రణమిల్లి నమస్కరించెదన్ -101



సీ॥ ఇవ్విధంబున బసవేశు పురాణంబు
సాంగంబు గొబ్బూరి సంగయకును
జెప్పియు మరియును శివభక్తసభలలో
చదివిన వ్రాసిన ముదముతోడ
పఠియించువారికి పరమాయురారోగ్య
మందు ఐశ్వర్యసంప్రాప్తులగుచు
నాచంద్రా తారార్కమై పుత్ర సంతాన
వృద్ధిలో నుందురు ఉర్వియందు

తే॥ ననుచుద్విపదార్థములు మీరలు వచింప
వినియు సర్వములుం చాలవెలయజేసి
నట్టి గొబ్బూరి సంగయ ననుదినంబు
దలచి మొక్కుదు నతడని పాదములనెపుడు -102

ఉ॥ వాసవముఖ్య సౌఖ్యపరవాది జనౌఘపయోజరాజ్యవి
శ్వాజసలింగ జంగముల సత్వర జీవనతైవభావనో
ల్లాస దయాలవాల యకలంక మహాత్మ ప్రసాదఖాదనా
భాన సుశీల పాలకురికార్ణవ సోమయదేహీ పాహిమాం -103

కం॥ ఖేచర సురగరుడోరగ
వాచరమేశాది నిఖిల వైభవ తృణగ
ణ్యా చరలింగా వాసక
గోచర సువిలాస పాలకురికినివాసా ! -104

**మాలిని॥**

శరణు శరణు దేవా రక్ష మహానుభావ
దురిత వనధినావా దుర్జనారణ్యదావా
స్థిరగణ గృహ కామాధేను రూపాభిరామా
పరమనికదిసోమా పాల్కురికి సోమనామా ! –105

గద్య :ఇది శ్రీమద్గురు లింగజంగమ ప్రసాద లబ్ధగణపవరోల్లసభవనాశ
పూరీవాస భక్తమాహేశ్వర పాదపంకేరుహ భృంగ
వీరసంగనామధేయ ప్రణీతంబైన
**బసవపురాణ సారంబను**
మహాకథలయందు
తృతీయాశ్వాసము

**–శుభం–**

